# చిత్రకవిత

## లక్ష్యలక్షణసమన్వితము

డా॥ హరి శివకుమార్

రీడర్, తెలుగు విభాగము
కాకతీయ విశ్వవిద్యాలయము
వరంగల్

డాక్టరేట్ అనంతర పరిశోధన వ్యాసము

1990

**శ్రీ కృష్ణ ప్రచురణలు – 5**

© ప్రతులు - 1000

రచన :

**డా॥ హరి శివ కుమార్**

మూల్యము :

**రూ. 100–00**

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయము చేసినవారు

**కాకతీయ విశ్వవిద్యాలయము, వరంగల్**

**తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాద్**

ప్రతులకు -

**డా॥ హరి శివ కుమార్**

8-4-18, శ్రీవిహార్, శ్రీ కృష్ణ కాలనీ

వరంగల్-506002, ఆం.ప్ర.

ముద్రణ :

**చార్మినార్ ఆర్ట్ ప్రింటర్స్**

గంజ్ బజార్, సికింద్రాబాద్

ఫొటో కంపోజింగ్ :

**ఓం సాయి లేజర్ గ్రాఫిక్స్**

నారాయణగూడ, హైదరాబాద్.

# కృతజ్ఞతాంజలి

చిత్రకవిత్వము సంస్కృతాంధ్రవాఙ్మయాలలో విశిష్టంగా కన్పించే ప్రక్రియ. ప్రాచీన – అర్వాచీన కవుల కావ్యాలలో అక్కడక్కడ ఇది కనిపిస్తుంది. పద్మ, నాగ, చక్ర, ఖడ్గాది రూపాలలో చిత్రవిచిత్రంగా కన్పించే ఆ చిత్రాలలో, తత్కర్తకుగల భాషా పరిజ్ఞానము, గురుపద్యవిద్యపైన వారికున్న అధికారము, స్పష్టంగా గోచరిస్తాయి.

సంస్కృతాంధ్ర కావ్యాలలోని ఇలాంటి చిత్రాలను దాదాపు మూడు నాలుగు వందలు సేకరించాను. అందులో ఉండే మెలకువలు, వాటికి అనుకూలమైన పద్యాల నిర్ణయము, ఆ పద్యాలలో వాటిని కూర్చే విధానాలు, అందులో కూడా ఒకరిని మించి మరొకరు చేసిన చిత్రాలు, ప్రతి బంధంలోను ఉన్న వివిధ రకాలు – అన్నింటినీ కూలంకషంగా చర్చించాను. వాటిని చిత్రాలతో సహా వివరించాను. లక్ష్య లక్షణ సమన్వితంగా ఉండేటట్లు ఈ గ్రంథాన్ని తయారు చేశాను.

ఆధునిక కాలంలో ఈ ప్రక్రియ వెఱ్ఱితలలు వేసింది. ఏదో ఒక బొమ్మగీసి, అందులో ఇష్టం వచ్చినట్లు అక్షరాలు కూర్చారు కొంతమంది. కాని, అవి అన్నీ సరిగ్గా ఉన్నట్లు కనపడదు. అందుకని సరియైన చిత్రాలు ఏవి అని నిర్ణయించటానికి కొన్ని పద్ధతులను సూచించాను. నా నిర్ణయాలకు అనుగుణంగా ఉన్నాయని నిశ్చయించుకొన్న దాదాపు 100 చిత్రాలను మాత్రమే తీసికొని వాటిని లక్ష్యలక్షణాలతో వివరించాను.

ఈ నా కృషి ఒక సిద్ధాంత వ్యాసమంత అయింది. డాక్టరేట్ అనంతర పరిశోధన వ్యాసమైన ఈ గ్రంథం, ఆ విషయాన్ని గురించి సమగ్రంగా అధ్యయనం చేయదలచిన వారికి ఎంతో మార్గదర్శకం కాగలదని నా నమ్మకము!

ఈ బృహత్ కార్యక్రమంలో నాకు అన్ని విధాలా సహాయం చేసిన వారిని నేను మరువలేను.

ఈ కృతి ప్రారంభం నుంచీ వెలుగులోకి వచ్చే వరకూ అన్ని విధాలా దోహదం చేసినవారు - మా కాకతీయ విశ్వవిద్యాలయంవారు. ముద్రణకు సహాయం చేసినవారు తెలుగు విశ్వవిద్యాలయం వారు.

ఈ గ్రంథంలో అడుగడుగునా సహాయం చేసిన వారు మా చిరంజీవులు విజయ్ - కృష్ణ - శ్రీనివాసులు; నా అర్ధాంగి శ్రీవల్లి.

సహాయసహకారాలను అందించిన వారిలో ముఖ్యులు - చి॥ జగన్మోహన్, శ్రీరంగాచార్య, కీ.శే. డా॥ గాదె ధర్మేశ్వరరావుగార్లు.

గ్రంథాన్ని ఎంతో అందంగా అచ్చు వేసి యిచ్చినవారు చార్మినార్ ఆర్ట్ ప్రింటర్స్, సికింద్రాబాద్ వారు. ఆ ప్రెస్ యాజమానులైన శ్రీ షేక్ బడే సాహెబ్ గారికి, వారి చిరంజీవి అస్లాంకు హృదయపూర్వక కృతజ్ఞతలు !

ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌కు అనువుగా దీనిని చక్కగా కూర్చిన ఓం సాయి లేజర్ గ్రాఫిక్స్ వారికి కృతజ్ఞతలు !

ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహాయపడిన వారందరికీ నమోవాకం ప్రశాస్మహే !

ప్రమోదూత - ఉగాది
27-3-1990

**హరి శివ కుమార్**

# ఉపయుక్తగ్రంథ సూచిక


1. అద్భుతోత్తర రామాయణము - నాదెళ్ళ పురుషోత్తమకవి
2. అప్పకవీయము - అప్పకవి
3. అప్పరాయయశశ్చంద్రోదయము- వేంకటశాస్త్రి
4 ఆంధ్రకౌముది - గణపవరపు వేంకటశాస్త్రి
5. ఆంధ్ర మహాభారతము
6. ఆంధ్ర మహాభ్యుదయము - బండ్ల సుబ్రహ్మణ్య కవి
7. ఆముక్తమల్యదమ్ - అమరవాది వేంకట నరసింహాచర్యః
8. కంకణబంధ రామాయణమ్ - చర్ల భాష్యకారశాస్త్రి
9. కవిరాజమనోరంజనము
10. కామాక్షీకల్యాణము
11. కావ్యప్రకాశః - బాలబోధినీ వ్యాఖ్యాసహితమ్
12. కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన
13. కావ్యాలంకార సంగ్రహము - రామరాజ భూషణుడు
14. కుమారసంభవము - నన్నెచోడుడు
15. గణేశ్వరీయము - భువనగిరి విజయరామకవి
16. గోపీనాథ రామాయణము
17. చంద్రలోకః - జయదేవః
18. చిత్రకందపద్యరత్నాకము - నాదెళ్ళ పురుషోత్తమకవి
19. చిత్రకావ్యకౌతుకమ్ - రామ రూప పాఠక్
20. చిత్రబంధావతారికా - శ్రీ రామావతారశర్మ
21. ఛందఃశిల్పము - డా॥ పాటిబండ మాధవశర్మ
22. ఛందోవికాసము - సంపత్కుమార
23. తాలాంకనందినీ పరిణయము - అ.మ.వేం.నరసింహాచార్యులు
24. తెలంగాణా శాసనములు - 2వ భాగము
25. తెలుగు భాషలో ఛందోరీతులు - రావూరి దొరసామిశర్మ
26. తెలుగుతో చిత్రకవిత్వము - డా॥ గాదె ధర్మేశ్వరావు
27. దశావతారచరిత్రము
28. నవరస సామంజస్యమ్ - శ్రీరాంలాల్ కపూర్

29. పాదుకాసహస్రమ్ - వేదాంత దేశికులు
30. పారిజాతాపహరణము - నంది తిమ్మన
31. ప్రబంధ రాజ వేంకటేశ్వర
విజయ విలాసము - గణపవరపు వేంకటకవి
32. బిల్హణీయము
33. బిల్వేశ్వరీయము - కొక్కొండ వేంకటరత్నశర్మ
34. ముకుంద విలాసము - కణాదము పెద్దన్న
35. యంత్ర చింతామణి
36. యథాశ్లోకతాత్పర్యరామాయణము - 1,2 భాగములు
37 రస-అలంకార-పింగళ - శంబూనాథ పాండ్యే
38 రాఘవాభ్యుదయము - చింతలపల్లి ఛాయాపతి
39. లంకావిజయము - పిండిప్రోలు లక్ష్మణకవి
40. లక్షణసార సంగ్రహము - చిత్రకవి పెద్దన
41. లక్ష్మీసహస్రమ్ - వేంకటాధ్వరి
42. లక్ష్మీసహస్రకావ్యము - డా॥ వేదుల
సూర్యనారాయణ శర్మ
43. వృత్త రత్నాకరః - కేదార భట్టః
44. వ్రాతవ్రతులు
45. శిశుపాలవధ మహాకావ్యము
46. శ్రీ మల్లికార్జున సహస్రమ్ - భువనగిరి చతుష్కము
47. శ్రీరంగ మహత్త్వము - భైరవ కవి
48. శ్రీ వేంకటేశ్వర చిత్రరత్నాకరము
1,2,3, భా - విక్రాల శేషాచార్యులు
49. శ్రీ వేల్పుగొండ లక్ష్మీనృసింహ - నం.రం. లక్ష్మీ
క్షేత్రమాహాత్మ్యము నృసింహాచార్యులు
50. షట్చక్రవర్తి చరిత్ర - కామినేని మల్లారెడ్డి
51. సమీరకుమార విజయము - పుష్పగిరి తిమ్మన
52. సరస్వతీ కంఠాభరణమ్ - (చిత్రప్రకరణమ్) - భోజః
53. సారంగధరీయము - పోకూరి కాశీపతి
54. సుమనోమనోభిరంజము - ఒగిరాల జగన్నాధకవి

# విషయసూచిక

# చిత్రకవిత

## ప్రస్తావన

ప్రాచీన కాలమునుండియు ఛందో బద్ధమైన కవిత ఆశు, మధుర, చిత్ర, విస్తర భేదములచే నాలుగు విధములుగా కనిపించుచున్నది. నన్నయగారు భారతమున 'మృదు మధుర చిత్ర విస్తర నవరసభావ భాసుర కవితారచనా విశారదులైన మహాకవులు' రాజరాజనరేంద్రుని సభనలంకరించి యుండినట్లు వర్ణించి యున్నారు. నన్నయగారి ననుసరించి, తరువాత కవులెందరో తమ రచనలలో ఈ చతుర్విధ కవితల ప్రస్తావన చేసియున్నారు. నన్నయ, శ్రీనాధుడు, పెద్దన, సూరన మొదలగు కవులందరును తమ తమ గ్రంథములలో ఈ చతుర్విధ కవితా ప్రస్తావన చేసినవారే. అట్లే, విన్నకోట పెద్దన, గణపవరపు వేంకటకవి, అప్పకవి, చిత్రకవి పెద్దన, రామరాజభూషణుడు మొదలగు లాక్షణికులును వాటిని గురించి చెప్పియున్నారు.

ఈ చతుర్విధ కవితలలో లాక్షణికులను అధికముగా ఆకర్షించినది చిత్రకవితయేయని చెప్పవచ్చును. అందు వలననే దానిని గురించి వారు అధికముగా తమ గ్రంథములందు ప్రపంచించి యున్నారు.

మేధకు అధికతరశ్రమ కలిగించునది, కవికి గల పాండిత్యమునకు నికషోపలమైనది ఈ చిత్రకవిత! కాని చిత్ర కావ్యములందు కావ్యముల కుండవలసిన వ్యంగ్య ప్రాధాన్యము లోపించుటవలన చిత్ర కావ్యములను అధమ కావ్యములుగా పరిగణించినారు లాక్షణికులు. ఏమైనను సంస్కృతాంధ్ర లాక్షణికులును కవులును చిత్ర బంధాదులను తమ గ్రంథములందు ప్రదర్శించి యున్నారు. కావ్యాదర్శము, కావ్య ప్రకాశము, ప్రతాపరుద్రీయము, సరస్వతీకంఠా భరణము, సాహిత్య రత్నా కరము మొదలైన సంస్కృత లక్షణ గ్రంథములందును, కావ్యాలంకార చూడామణి, ఆంధ్రకౌముది, అప్పకవీయము, లక్షణసార

సంగ్రహము, కావ్యాలంకార సంగ్రహము మొదలగు ఆంధ్రలక్షణ గ్రంథములందును ఈ చిత్రకవితా ప్రస్తావన యున్నది. లక్ష్మీ సహస్రము, పాదుకాసహస్రము వంటి సంస్కృత కావ్యములందును, కుమార సంభవము, పారిజాతాపహరణము, బిల్వేశ్వరీయము, సారంగధరీయము, అద్భుతోత్తరరామాయణము, ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము మొదలగు అనేక ఆంధ్ర కావ్యములందును చిత్ర బంధము లున్నవి.

ఈ చిత్రకవితలో ప్రధానముగా మూడు భాగములు గోచరించుచున్నవిః-

1. అక్షరములను, శబ్దములను చిత్రముగా కూర్చుట.
2. ఒక పద్యములోనే మరొక పద్యమును పొందుపరచుట.
3. పద్మ చక్రాది చిత్రములలో పద్యములను పొందు పరచుట.

ప్రతిభావంతులైన కవీశ్వరులు కొందరు అక్షరములను, శబ్దములను కూర్చుటలో చిత్రవిచిత్రమైన పద్ధతులను అనుసరించి, అనేక చమత్కారములను చూపియున్నారు. ఉదాహరణకు, ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమున - ద్విరుక్త కందము (341 పద్యము), సంవత్సరయుక్త సీసము (389), సర్వలఘువచనము (392), చతుష్పాదయమకము (402), బహువిధ శబ్ద చిత్రము (424), అనేకాక్షరఘటిత దుర్ఘటయమక విఖ్యాత గీతి (426), సర్వగురు వచనము (447), ప్రాసానుప్రాసగీతి (440), శబ్దపునరుక్తి త్రిస్తబక క్రమాలంకార సీసము (549), సకలయమకము (586, 847), శృంఖలిత వచన రగడ (805), చతుర్థికందము (817), అచలజిహ్వాక (832), నిరోష్ఠ్యాచల జిహ్వాక (832), దుష్కరప్రాసము (864,865,868), పాద గోపనము (950), మొదలగు అనేక శబ్ద చిత్రములు ప్రదర్శింప బడియున్నవి. అట్లే శ్రీ పోకూరి కాశీపతిగారు తమ 'సారంగధీరయము'న - ఏకాక్షరి (2-76), గుడుసులు (2-135), తలకట్లు (2-109), కొమ్ములు (2-7), ఏత్వములు (3-43), ఏకపాది (2-59), ద్విపాది(2-67), కేవల లఘ్వక్షర సర్వలఘు సీసము(1-68),

సర్వతఃప్రసము (8-10 ), సోష్ఠ్యము (2-127 ), నిరోష్ఠ్యము (2-136 ), అపంచవర్గీయము (2-126 ), పంచప్రాసము (3-102 ), పాదభ్రమకము (2-128 ), పద్యభ్రమకము (2-129 ) - వంటి వైచిత్రములను ప్రదర్శించియున్నారు.

ఇక రెండవది - ఒక పద్యములో మరొక పద్యమునుగాని, అంతకన్న ఎక్కువ పద్యగీతాదులను కాని పొందుపరచుట. ఈ పొందిక ఒకటినుంచి సహస్ర సంఖ్య వరకును సాగినది. దీనిని 'గర్భకవిత' యనవచ్చును. ఉదాహరణకు - చంపకమాలలో ఇటునటుగల అక్షరములను కొన్నింటిని తొలగించి కందమునో గీతమునో వెలికి తీయవచ్చును. అట్టివి - మత్తేభగీత కంద గర్భసీసము, స్రగ్విణీగర్భ భుజంగప్రయాతము, కందగర్భమణిగణ నికరము, చతుర్విధకందము, అష్టవిధకందము, కందద్వయ గర్భిత భాస్కర విలసితము - మొదలగునవి. గణపవరపు వేంకటకవి వంటివారు ఒకే సీసపద్యమున (ప్రబంధరాజ - 808) 30-40 పద్యములను కూర్పగా, నాదెళ్ల పురుషోత్తమ కవిగారు తమ 'అద్భుతోత్తర రామాయణము'న వ్రాసిన అత్యద్భుత 'సీసచక్రవర్తిని' (7-211)లో సహస్రాధిక పద్యములను పొందు పరచియున్నారు.

మరి మూడవది - 'చిత్రకవిత' - పద్మ చక్రాది చిత్రములలో పద్యములను కూర్చుట. ఒక్కొక్క చిత్ర బంధమున ఒక్కొక్క పద్యమునే కూర్చుట పరిపాటి. కాని, గణపవరపు వెంకటకవి వంటివారు 'పుష్పమాలికాబంధ - గోమూత్రికాబంధ - గుచ్ఛబంధ- హలబంధ - ఛత్రబంధ చంపక నిరోష్ఠ్య కందము (ప్రబంధరాజ - 851) వంటి పద్యములను అనేక చిత్ర బంధములకు పనికి వచ్చునట్లు కూర్చియున్నారు. శ్రీ వేదాంత దేశికులు మరొక అడుగు ముందునకు వేసి, అష్టదళపద్మబంధమును పాదుకాబంధమును కలిపి 'పాదుకాయుగళ గర్భకర్ణిక మష్టదళ పద్మము' వంటివానిని చిత్రించి యున్నారు.

ఈ గర్భచిత్ర కవితలను రెంటిని కలయబోసి, తమ

ప్రజ్ఞాపాటవములను ప్రదర్శించిన ప్రతిభావంతులును లేకపోలేదు. ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసమునందలి 808వ 'చిత్ర సీసము'న - ద్విపద - కందద్వయము - సమ వృత్తము -చౌపది- ఆట వెలది - తేటగీతి - మదనవిలసితము - తురంగ వృత్తము - అష్టకము- ధవళము - శోభాన - హారతి - జంపె - సువ్వాల-లాలి - ఏల - రగడ- కొరవంజి - కళిక - ఉత్కళిక - అహిరరాగదరువు - అనుష్టుప్ శ్లోకము- అనులోమ విలోమకందము - మొదలగు అనేక వృత్త గీతాదులు నిబద్ధింపబడినవి. అవికాక, కంకణ - పుష్పమాలికా - గోమూత్రికా -శార్ఙ- పద్మ - పాదుకా - నవరంగ - శకట - నాగ - రథ - వీణా - శంఖ - మృదంగ-సర్వతోభద్రాది బంధములును అనేకము బందితములై యున్నవి.

ఇన్ని చిత్ర విచిత్రములైన పోకడలున్న చిత్ర కవితలో నేను గ్రహించినది మూడవ భాగమైన చిత్ర బంధములున్న అంశము మాత్రమే. మిగిలిన వానిని గురించి కూడ వ్రాయదలచినచో ఇంతకు మరి రెండింతల గ్రంథమగును. కనుక దీనిని ఏక దేశము చేసినాను.

అసలీ చిత్రకవిత ఎట్లు ఆవిర్భవించి యుండునని ఆలోచింప వలసియున్నది. ప్రాచీన సంస్కృతాంధ్రలాక్షణికులును కవులును ఉపయోగించిన చిత్రబంధములను గమనించినచో కొంతవరకు అదిస్పష్టము కాగలదు. చక్రబంధము, పద్మబంధము వంటివి మాత్రమే సంస్కృతాంధ్ర లక్షణికులందరి చేతను చెప్పబడినవి. అందులో కవిపేరు, కృతిపేరు, గుణము, క్రియ మొదలగునవి గుప్తముగా చెప్పు పద్ధతి కనిపించును. అట్లు వానిని నిగూఢముగా చెప్పి, 'వక్రోక్తి' విధానము నవలంబించు ఉద్దేశ్యముతో బహుశః ఈ చిత్రకవితా ప్రక్రియ ప్రారంభమై యుండును. అదే విధానము రథ - గవాక్ష - గోపురాది బంధములలో అనుసరింపబడినది. కాని, కాలాంతరమున ఆ విధానము అంతరించి, కేవలము రక రకముల చిత్రములు నిర్మించి వానిలో అక్షరములను కూర్చుటయే ధ్యేయమైనది. కావున రకరకముల చిత్రబంధములు వెలసినవి. కాని వానిలో చమత్కారము లోపించినది. అయినను

కొంతవరకు ఔచిత్యము పాటింపబడుచునే వచ్చినది. నాగబంధమున ఈశ్వరప్రార్థనము, ఖడ్గ బంధమున శత్రుసంహారము, మాలికాబంధమున శుభాకాంక్షలు వంటివి అందుకు నిదర్శనములు.

మరికొంతకాలమునకు కవులపాండిత్యము వక్రోక్తి విధానమునకు బదులు వక్ర విధానము ననుసరించినది. సృష్టిలోని సకలవస్తుజాలము చిత్ర బంధములకు వస్తువు కాజొచ్చినది. అందువలననే కూజా, ఝారీ, దువ్వెన, సుత్తె, సమ్మెట, తాంబూలము, చివరకు గణికవంటివి కూడ చిత్రబంధవస్తువులుగా స్వీకరింపబడినవి. అది ఈ చిత్రకవితకు పతనహేతువైనది. దానిపట్ల ఏహ్యాభావము కలుగునట్లు చేసినది.

ఈ చిత్రకవితయందు పాటింపబడిన 2,3 విషయములు ముఖ్యముగా గమనింపవలసియున్నది. అవి –

## 1. సమాక్షర విన్యాసము :–

సంప్రదాయబద్ధమైన చిత్రములలో ఈ సమాక్షర విన్యాసము స్పష్టముగా గోచరించును. చిత్ర బంధములలో అన్ని వైపులనున్న అక్షరములు సమాన సంఖ్యగలవై యుండును. చక్ర – పద్మ – ఖడ్గ – మలికా – రథ – మురజాది చిత్రబంధములన్నింటియందును దీనిని గమనింపవచ్చును. చిత్ర బంధములలో సరిగా ఇమడని పద్యములు సరిగాలేవని చెప్పుటకు కూడ అవకాశమున్నదన్నచో, అవి ఎంత క్రమబద్ధము లైనవో ఊహింపవచ్చును. కాని ఆధునిక కవులు వ్రాసిన చిత్రబంధాదులలో ఈక్రమాక్షర విన్యాసములోపించిన దనవచ్చును. అది తత్కర్తల అశక్తతను వెలువరించును. కనుక ఈ సమాక్షర విన్యాసము కవిగారి శక్తి సామర్థ్యములకు నిదర్శనము.

## 2. సంక్షిప్తత :–

పద్యమును చిత్రములో నిబంధించినపుడు అక్షరసంఖ్య తగ్గిపోవుట గమనింపవచ్చును. ఉదాహరణకు – పుష్పబంధ చంపకమాలలోని 84 అక్షరములును 60 కి తగ్గిపోయినవి. షోడశదళపద్మబంధములోని 32

అక్షరములు 17 కు తగ్గిపోయినవి. గుచ్ఛబంధములోని 32 అక్షరములును 17 కు తగ్గిపోయినవి. సింహావలోకన చతుర్దళ పద్మబంధములోని 39 అక్షరములును 17 కు తగ్గినవి. ఇట్లు ఒకేరకమైన అక్షరములను పునఃపునః ఆవృత్తమగునట్లు చేసి, చిత్రగమనమునకు అనుకూలముగా కూర్చి, వాని సంఖ్యను సంక్షిప్తపరచుట ఈ చిత్రకవితలోని మరొక లక్షణము. ఈ సంక్షిప్తత కూడ అన్నివైపులకు సమానముగా పాటింపబడును. గుచ్ఛ - పద్మ బంధాలలో ఇది స్పష్టముగా గోచరించును. అయితే ఇది సార్వత్రికము కాదు. రథ - గోపుర ఖడ్గబంధాదులలో ఇది గోచరింపదు.

### 3. అనుకూల వృత్తవరణము :-

ప్రతివృత్తము ప్రతిచిత్రబంధమునకు సరిపోదు. కొన్ని వృత్తములు మాత్రమే సరిపోవును. అందువలన కవి తాను నిర్మింప దలచిన చిత్ర బంధమ్ములకు అనుకూలమైన వృత్తమునే స్వీకరింపవలసి యుండును. ఉదాహరణకు - ఖడ్గ బంధమునకు కందము - శ్లోకము - సుగంధివృత్తములు మాత్రమే అనుకూలములు. నాగబంధమున 84 స్థానములలో అక్షరములను పొందుపరచవలెను కావున దానికి 84 అక్షరములుండు చంపకమాల - స్రగ్ధరలే అనుకూలములు. ఇక పుష్ప మాలిక రథ బంధాదులలో సంఖ్యానియమము లేదు కావున కందమో, సీసమో గ్రహింపబడినది. అయితే వీనిలో అక్షరగణములు కాక, మాత్రాగణములు స్వీకరింపబడుటలోని ఆంతర్యము - అవసరమైనచో అక్షరములను పెంచుకొనుటకును, తగ్గించుకొనుటకును అవకాశ ముండుటయే!

మొత్తము మీద 'చిత్రకవిత' ఇట్టి నియబద్ధమైన గతులలో సాగినది. అట్లు సాగినంతవరకు అది చమత్కారజనకమై, హృదయాహ్లాదియై విరాజిల్లినది. అది అంతరించగానే వెగుటు పుట్టించినది.

ఈ గ్రంథములో నేను చిత్రకవితలోని వివిధరకముల చిత్రబంధ

ములను, వాని నిర్మాణములోని మెళకువలను, అందలి బాగోగులను, సౌకర్య - అసౌకర్యములను, ప్రయోజన నిష్ప్రయోజనములను సునిశిత ముగా పరిశీలించి, నాకుతోచిన విషయములను సహృదయుల ముందుంచుటకు ప్రయత్నించినాను.

కేవలము తెలుగు గ్రంథములను మాత్రమే స్వీకరించి లక్ష్యలక్షణ సమన్వయము చెయవలెనని మొదటి సంకల్పించితిని. కాని అది ఈవిధాన పరిధిని సంకోచపరచటమేకాక అసమగ్రముని కూడ అనిపించినది. అందువలన సంస్కృతాంధ్ర లాక్షణికుల లక్ష్యలక్షణములన్నింటిని లభించి నంతవరకు స్వీకరించినాను. వానినన్నింటిని ఒక క్రమపద్ధతిలో వివరింప ప్రయత్నించినాను. రసజ్ఞులు దీనిని సహృదయతతో స్వీకరించెదరని ఆశించుచున్నాను.

# 1. అర్ధభ్రమక బంధము

అర్ధభ్రమకమునకు చతురంగక్రీడ వలె 64 గదులున్న చిత్రమును గీయవలెను. పాదమునకు 8 అక్షరముల చొప్పున 4 పాదములు గల వృత్తమును వ్రాసి, తరువాత అదే వృత్తమును ఏ పాదమున కాపాదమును వరుసగా తలక్రిందులుగా ఖరోష్ఠిపద్ధతిన వ్రాయవలెను. అట్లు వ్రాసిన తరువాత మొదటి నుంచి అన్ని వరుసలలోని ప్రథమాక్షరములను, తరువాత 2-3-4 అక్షరములను నిలువుగా చదువగా ఆ పద్యము రావలయును. అట్లే క్రింది నుంచి పైకి 8-7-6-5 వరుసలలోని అక్షరములను మీదికి చదువగా అదే పద్యము పునరావృత్తమగును. అనగా - ఇందు, అడ్డముగను, నిలువుగను కూడ 1వ వరుసలోని మొదటి పాదము యొక్క మొదటి సగభాగమును ఒక రీతిగా నుండును. అట్లే 2వ వరుసలోని రెండవపాదము యొక్క సగభాగమును, 3వ వరుసలోని 3వ పాదము యొక్క సగభాగమును, 4వ వరుసలోని 4వ పాదము యొక్క సగభాగమును ఒకే రీతిగా నుండును. ఇట్లు వృత్తము అర్థభాగమే తిరుగుచున్నది కావున ఇది 'అర్ధభ్రమకము' అనబడినది. అట్లు కాక వృత్తము అన్నివైపుల నుండియు చదువుటకు అనువుగా నుండునట్లు (అన్ని) అక్షరములను కూర్చినచో అది 'సర్వతోభద్రబంధ'మగును.

భోజుడు తన 'సరస్వతీ కంఠాభరణము'న ఈ అర్ధభ్రమకమును లక్ష్య లక్షణ సమన్వితముగా వివరించినాడు. ఆయన ఇచ్చిన లక్ష్యము -

న సత్వర తిగే నిత్యం
సదారామర్షనాశిని
త్వరాధిక కసంనాదే
రమకత్వ మకర్షతి - అనునది.

దీనికి వేరొక లక్ష్యము శ్రీ వేదాంత దేశికుల 'పాదుకా సహస్రము'న కలదు. అది-

"లోకతారా క్షామ చారా
కవిరాజ దురా వచా
తారాగతే పాద రామ
రాజతే రామ పాదుకా" - అనునది (చిత్రము-1 ).

డా॥ వేదుల సూర్యనారాయణ శర్మగారు అన్నీ గుర్వక్షరములతోనే ఉన్న విద్యున్మాలా వృత్తమును వ్రాసియున్నారు. అది -

"నాకా సారా సారా వాసా
కాకా కాకా మాభా భావా
సాకా రారా కావా భారా
రాకా రాజా స్యాకా మాసా"

(లక్ష్మీసహస్రకావ్యం-పు.224)

ఈ అర్ధభ్రమకమును 64 గదులలో సమముగా నింపవలయును కనుక పాదమునకు 8 అక్షరములున్న 4 పాదముల సమవృత్తమే దీనికి అనువైనదనుట సమంజసము.

ఈ అర్ధభ్రమకబంధము తాంత్రికగ్రంథములందును ప్రయోగింపబడుట గమనార్హము. 'యంత్ర చింతామణి'లో 'ద్యూత విజయకర యంత్ర'మని ఒకటి యున్నది. దానికే 'ప్రసన్నయంత్ర'మనియు నామాంతరము. అందులోని శ్లోకము

"మేక్షై రక్తం దయేరూపా
కజజతం దనీచనః!
ఛదావీయం మంత్రంతేష
హేష్టివామోక్షిణపాత్రం॥ (పు.120)

ఈ శ్లోకమును అర్ధభ్రమకబంధమున చిత్రము-1Aలో చూపినట్లు కాకిఈకతో ఏరండ పత్రముపైన నల్లని మసితో వ్రాసి, దానిని ధరించి ద్యూతమాడినచో తప్పక విజయము లభించగలదట! దానిని కూర్చినది దామోదరకవి. దీని ఫలితము ఆలోచనీయము.

ఇది అర్ధభ్రమకబంధపు మరొక ప్రయోజనమని తెలియుచున్నది.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| లో | క | భా | రా | కా | మ | చా | రా |
| క | వి | రా | జ | దు | రా | వ | చా |
| భా | రా | గ | తే | పా | ద | రా | మ |
| రా | జ | తే | రా | మ | పా | దు | కా |
| కా | దు | పా | మ | రా | తే | జ | రా |
| మ | రా | ద | పా | తే | గ | రా | భా |
| చా | వ | రా | దు | జ | రా | వి | క |
| రా | చా | మ | కా | రా | భా | క | లో |

అర్థభ్రమక బంధము

[చిత్రము - 1].

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మే | ఖై | ర | క్షేం | ద | యే | రా | పా |
| క | జి | జ | అం | ద | సే | చ | నః |
| ఖ | దా | వీం | య | మం | త్రం | శే | ష |
| వే | ష్టై | వా | మో | క్షై | గా | పా | త్రం |
| త్రం | పా | గా | క్షై | మో | వా | ష్టై | వే |
| ష | శే | త్రం | మం | య | వీం | దా | ఖ |
| నః | చ | సే | ద | అం | జ | జి | క |
| పా | రా | యే | ద | క్షేం | ర | ఖై | మే |

అర్ధ భ్రమక బంధము

[చిత్రము - 1A].

# 2. కంకణ బంధము

కంకణ బంధమునకు ఒకదానిలో ఒకటి ఇముడు నట్లు రెండు వలయములను గీచి, అందులో ఒక వృత్తమును కూర్తురు. దానికి ఆద్యంతములు తెలియుట కష్టతరమగును (ప్రబంధ-సంబంధ-15)

ఇందు అన్ని అక్షరములును గురువులే యుండును. కనుక ఏ అక్షరము వద్దనుండి గణవిభాగము చూసినను గణభంగముకాదు. అట్లు ఒక్కొక్క అక్షరము వద్ద ప్రారంభించి చూచినచో, 64 వృత్తములు వచ్చును. ఈ బంధమునకు అన్నీ గుర్వక్షరములే గల వృత్తము కావలెను కనుక, లాక్షణికులును, కవులును విద్యున్మాలావృత్తమునే స్వీకరించి యున్నారు.

అప్పకవి కంకణబంధమునకు ఉదాహరణముగా-

"సేవే గోపాలం కేశిఘ్నం
గోవృద్ధ్యద్రిధ్రం శం శంభుం
శ్రీనాథం భూనాథం వీనార్యం
కందాభాసం నీరాగారం" - (చి ఋ-2)

అను విద్యున్మాలా వృత్తమునే ఇచ్చియున్నాడు.

సంస్కృతాంధ్రములలో అనేక బంధములను వ్రాసిన శ్రీవత్యము పరబ్రహ్మశాస్త్రులవారు ఈ కంకణ బంధమునకు మరొక లక్ష్యము నిచ్చియున్నారు. అది -

"వ్యాసాద్యావా కామాధ్యాయా
పాల్యాళ్యాగాత్రీ లాత్రాశా
స్త్రాధారాభా టీక్యాఖ్యాప్యా
లీనామేహా వైస్మాస్యాభా - అనునది.

(ప్రబంధరాజ-పీఠిక-పుట.36)

శ్రీచర్లభాష్యకార శాస్త్రిగారు 'కంకణబంధరామాయణము' అను ఏకశ్లోక గ్రంథమును వ్రాసినారు. దానికి 'అర్థశ్లోకరామాయణం' లేక 'మేకాధీశరామాయణం' అని నామాంతరములు. అందు 'అర్థశ్లోకయమక

కంకణబంధ' మనుపేర ఒకే ఒక శ్లోకమున్నది. అది -

శ్రీశ్రీ రాజా భూదాధారా
ధారా సారా మేకాధీశా
శాధీకామే రాసారాధా
రాధీదాభూజారాశ్రీశ్రీ.

ఇందు అనులోమముగ 16, విలోమముగ 16 శ్లోకములు వచ్చును. 32 శ్లోకములలో దశరథ వర్ణనము నుండి రామ పట్టాభిషేకము వరకును గల 32 ఘట్టములు వర్ణింపబడినవి.

పై లక్ష్యములను బట్టి ఈ కంకణబంధమునకు విద్యున్మాలా వృత్తమే అనుకూలమైనదని స్పష్టమగుచున్నది.

# 3. ఖడ్గ బంధము

ఖడ్గమును గీసి దాని పిడి యందును, వాదరలందును అక్షరములను కూర్చిన ఖడ్గబంధమగును. ఇందు 2వ పాదము యొక్క చివరి అక్షరమును ఖడ్గపు కొనయందు వచ్చునట్లు కూర్పవలెను. తిరిగి అదే అక్షరమును 3వ పాద ప్రారంభమునను, 4వ పాదము చివరను కూర్పవలెను. ఖడ్గపువాదరలందలి అక్షరముల సంఖ్య సమానముగా నుండవలెను.

ఈఖడ్గ బంధమున పిడిలోని అక్షరముల సంఖ్య మారవచ్చును. ఆ మార్పును బట్టి వివిధ రకముల ఖడ్గ బంధము లేర్పడుచున్నవి.

అప్పకవి 4 రకముల ఖడ్గబంధముల నిచ్చియున్నాడు. అవి :

1. శమ దమ సమధిక చిత్తా
   విమలాంభోజారి హస్త విష్టర కర్ణా
   యమలార్జున తరుభంజన
   కమలాధరణీ సనాథ కంధరవర్ణా (చిత్రము-3A)
2. ధనద నవీన కనత్కన
   కనకాంబర వాసుదేవ కరుణాపాంగా
   శివివరద శుభాకరదళ
   త్కనక కశిపుపూర్వదేవ కందనిభాంగా (చిత్రము-3B)
౩. శూర వరదరఘువర ముర
   మారణ చాణూర కంస మధుపౌండ్రహరా
   రారాజత్కనకాంబర
   ఘోరగ్రాహారి రక్ష గోపీజారా(చిత్రము-3C)
4. శారద రసారమణ దర
   పారద రజనీశకీర్తి పావనచరితా
   తారక రిపు వినుత హరి య
   పారదయార్ణవ ముకుంద భావజతాతా (చిత్రము-3D)

ఈ (4) రకములలోను మొదటి రెండును ఒక విధానమున

నున్నవి. 3,4 బంధనులు ఒక విధముగా నున్నవి. 1,2 చిత్రములలో ఖడ్గపు కొనయందలి అక్షరము 2,4 పాదముల చివరమాత్రమే వచ్చునట్లు కూర్పబడినది. 3వ పాదము ప్రారంభమున కూర్పబడలేదు. 3,4 చిత్రములలో కొద్ది భేదమున్నది. 2,4 పాదముల చివర నే కాక, 3వ పాదప్రారంభమునను ఒకే అక్షరము వచ్చునట్లు కూర్పబడినది.

అప్పకవి ఇచ్చిన ఈ 4 ఉదాహరణములును కందపద్యముననే ఉన్నవి. కంద పద్యము మాత్రాగణ బద్ధమైనది. అందువలన అక్షరముల సంఖ్య మారుటకు అవకాశమున్నది. దానిని బట్టి పిడిలోని అక్షరసంఖ్య మారి 4 రకములేర్పడినవి.

వీనిలో గమనించవలసిన అంశము ఒకటి ఉన్నది. అది కత్తి వాదరలలోని అక్షరసంఖ్య సమానముగా నుండుట!

అప్పకవి ఇచ్చిన 4 ఖడ్గబంధములందును ఈ నియమము చక్కగా పాటింపబడినది. కాని ఆధునిక కవుల కృతులలో ఈ లక్షణము ఉల్లంఘింపబడినది. ఉదాహరణకు - మహాకవి బంధ్ల సుబ్రహ్మణ్యముగారు వ్రాసిన 'ఆంధ్రమహాభ్యుదయము'న 6 ఖడ్గబంధములున్నవి (5,8,9,10,11,12). అందు కత్తివాదరలందలి అక్షరసంఖ్యా నియమము పాటింపబడనందున, అది సరియైన విధానముగా కనబడుటలేదు.

చింతలపల్లి ఛాయాపతి 'రాఘవాభ్యుదయము'న 3 ఖడ్గ బంధములను వ్రాసినాడు (1-210, 2-257, 6-364). మూడింటను కందపద్యమే ప్రయుక్తమైనను, వాదరలందు అక్షర సంఖ్యానియమము పాటింపబడలేదు. ద్వితీయాశ్వాసములోని ఖడ్గబంధమును 'చంద్రహాస బంధ'మని వ్యవహరించుట గమనార్హము.

గోపీనాథ వేంకటకవి కృత 'శిశుపాలవధ' మహాకావ్య అనుబంధమున ఒక ఖడ్గబంధము కలదు. అయితే గోపీనాథకవి అందరివలె కందపద్యమును కాక 'సుగంధివృత్తము'నుపయోగించినాడు. సుగంధివృత్తమును స్వీకరించుటవలన ఒక క్రొత్త గమనము, వెసులుబాటు సిద్ధించినవి. అందు గమనించవలసిన ముఖ్య విషయములు రెండు కలవు. ఖడ్గబంధమున కత్తికొన యందలి అక్షరము

ఒక్కటే (2,4 పాదముల అంత్యాక్షరము) పునరావృత్తిగా చదువబడును. కాని పిడి-కత్తుల కలయిక వద్దవచ్చు అక్షరమును (1,3 పాదముల చివరి అక్షరము, 4వపాదము మొదటి అక్షరము) ఒక్కటిగా ఉండునట్లు రచించుట వలన ఆ ఖడ్గబంధపు పిడియందు మరొక అక్షరము పెరిగినది. అట్లు పెరుగుటవలన ఇతర ఖడ్గబంధములలో పాటింపబడని మరొక సొగసు ఇందుకల్గినది. ఖడ్గబంధమున కత్తివాదరలందలి అక్షరములు మాత్రమే సమానమైనవిగా ఉండును. మధ్యభాగమునందలి అక్షరముల సంఖ్య భిన్నమై యుండుట పరిపాటికాగా, గోపీనాధ కవి వ్రాసిన సుగంధివృత్తమున కత్తివాదర లందలి అక్షరములును కత్తిమధ్యభాగము నందలి అక్షరములును సమానముగా నుండి, ఖడ్గ బంధమున నొక బిగువును సొంపును కూర్చినవి. (చిత్రము-3E)

అప్పకవి ఇచ్చిన ఉదాహరణలలో ఒకటి సుగంధివృత్తమున గలదు. దానిని బట్టి అప్పకవి దృష్టిలో కందమేకాక సుగంధివృత్తము కూడ ఖడ్గబంధమునకు అనుకూలమని స్పష్టమగుచున్నది. కాని అప్పకవి ఇచ్చిన ఉదాహరణమున కత్తిపై వాదరయందు ఒక అక్షరము అధికముగా ఉండుటవలన సమానత పాటింపబడలేదు. కాని, చిత్రకవి పెద్దనార్యుడు తన 'లక్షణసారసంగ్రహము'న (3-138) ఖడ్గబంధమునకు సుగంధి వృత్తమే చెల్లునని చెప్పి, లక్ష్యలక్షణ సమన్వితముగా వివరించి నాడు. బహుశః, కత్తివాదరలందును మధ్యభాగమునను అక్షరములు సమాన సంఖ్యలో నుండుట పెద్దనార్యునికి బాగుగా నచ్చియుండును. అందువలననే దానికి సుగంధివృత్తమే చెల్లునని ఆయన నొక్కి చెప్పినాడని చెప్పవచ్చును.

పెద్దనార్యుడు ఇందొక నియమమును గూడ చెప్పినాడు. కృతిభర్త పేరును పిడినడుమగాని, అంచులయందుగాని, మొనయందుగాని ఉంచ రాదనియు, అట్లు చేసినచో కృతిపతి బంధమరణ రోగావృతుడగు ననియు చెప్పియున్నాడు (3-139).

శ్రీ పక్కివేంకట నరసయ్య కవి తన 'శకుంతలా పరిణయము'న ఖడ్గబంధమునకు సుగంధివృత్తమునే వాడియున్నాడు.

గణపవరపు వేంకటకవి తన 'ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము'న ఇదే విధముగా కత్తి వాదరలందును మధ్యను ఉన్న అక్షరములను సమానముగా ఉండునట్లు కూర్చియున్నాడు. అయితే అందు సుగంధి వృత్తమునకు బదులు ఉత్సాహావృత్తము వాడబడుట గమనార్హము (ప్రబంధరాజ-856వ పద్యము). అంతేకాక వేంకటకవి దానిని 'పట్టిస బంధ'మని వ్యవహరించినాడు.

లక్ష్యలక్షణములను ఒకేచోట కూర్చుట సంస్కృత లాక్షణికుల ప్రత్యేకత! జయదేవుడు 'చంద్రాలోకము'న ఇచ్చిన -

"కావ్య విత్ప్రవరై శ్చిత్రం ఖడ్గబంధాది లక్ష్యతే
తేష్వాద్య ముచ్యతే శ్లోక ద్వయీ సజ్జన రఞ్జికా॥
కామినీవభవత్ఖడ్గ రేఖా చారుకరాలకా
కాశ్మీర శేకా రక్తాంగీ శత్రుకంరాంతికాశ్రితా॥"

(చంద్రా-9,10)

అను శ్లోకములలో లక్ష్య లక్షణములు రెండును ఒకే ఖడ్గచిత్రమున (చిత్రము-3F) ఇమడ్చబడినవి. దాని విధానము కూడ ఆంధ్ర లాక్షణికుల విధానము కన్న భిన్నముగా నున్నది. కత్తిపైన 3 వరుసలు కాక రెండే వరుసలున్నవి. అంతేకాక కత్తి పిడి యందలి అక్షరముల సంఖ్యయు సమానముగా లేదు.

మమ్మటుని 'కావ్య ప్రకాశము'న (పుట-530) మరొక విధమైన ఖడ్గబంధమున్నది. అందు

"మారారి శక్ర రామేభముఖై రాసార రంహసా।
సారారబ్ధ స్తవానిత్యం తదార్తి హరణక్షమా॥ (1)
మాతానతానాం సంఘట్టః శ్రియాం బాధిత సంభ్రమా।
మాన్యాథసీమారామాణాం శంమే దిశ్యా దుమాదిమా॥" (2)

అను 2 శ్లోకములున్నవి (చిత్రము-3G). ఇందలి అక్షరక్రమము శాస్త్రీయముగా పాటింపబడినను పఠనానుకూలముగ లేనందున ఇది కూడ సమంజసముగా తోచుటలేదు. బహుశః ఈ లక్షణము ననుసరించియే కావచ్చును 'చిత్రకవి' పండిత రామరూపపాఠక్‌గారు తమ 'చిత్రకావ్య

కౌతుకము'న సరిగా ఇలాంటి ఖడ్గబంధమునే ఒకదానిని ఇచ్చియున్నారు. (పుట-18)

శ్రీ నల్లంతిగళ్ చక్రవర్తుల లక్ష్మీనృసింహాచార్యులవారు తమ 'వేల్పుగొండ లక్ష్మీనృసింహ క్షేత్ర మహాత్మ్యము'న 'విచిత్ర ఖడ్గబంధ'మని ఒకటి వ్రాసి యున్నారు.

"ధీరా మారా కారా
తారాహారాభరాజధర ధర నిరతా
తారకపతనువిరధరా
ధారాధర వినుత పకరతాధర నిరతా"(వేల్పుగొండ -I-31)

అను ఆ లక్ష్యమున కత్తి వాదరపైన ఒకే వరుస గలదు. పద్యగమనమున అవే అక్షరములు అనులోమ విలోమగతులలో నడచునట్లు పొందుపరుపబడినవి (చిత్రము-3H). పుస్తకమున పద్యములోని అక్షరముల పొందిక సరిగా లేదు. చిత్రబంధమును బట్టి పైరీతిగా పద్యము మార్చవలసి యున్నది. పైగా ఇది, 'క్షురికాబంధ' విధానమున నుండుట గమనార్హము.

తిమ్మకవి 'పారిజాతాపహరణము'న 'ఛురికాబంధ'మని ఒకటి కలదు. అది -

"శ్రీవర వర వర హృత భవ
భావన వనజాయతాక్ష పాలిత విబుధా
ధావిత దనుభవనియమి స
భావన చతురా సముద్ధృతార్ణవ వసుధా"
(పారి5-96)

దానిని 'చిత్రము-3 - I' లో చూడవచ్చును. ఖడ్గము యొక్క హ్రస్వ రూపమే ఛురిక. అందువలన ఖడ్గబంధమును కూర్చు విధానముననే ఈ ఛురికాబంధమును కూర్పబడినది.

గణపవరపు వేంకటకవి తన 'ప్రబంధరాజవేంకటేశ్వర విజయ విలాసము' (830వ పద్యము)న'కటారికా బంధము' అనుపేర ఒకటి విరచించినాడు. అది -

"సార తర శూర బుధ మం
దారా హారాభిరామ దాక్షిణ్య నిధీ
ధీరాగ్రేసర రిపుసం
హారా భీమ ప్రతాప యసుర విరోధీ" - అనునది.

కటారిక అన్నను ఛురికయే కావున దీనిని కూడ ఖడ్గబంధము వలెనే కూర్పనగును.

అందువలన ఈ ఛురికా-కటారికా బంధములను కూడ ఖడ్గబంధముననే అంతర్భవింపజేయవచ్చును.

అప్పకవి ఇచ్చిన లక్ష్యము లన్నింటియందును దాదాపు శత్రుసంహారమే వర్ణితమైయున్నందున, అప్పకవి ఔచిత్యమును కూడ ప్రదర్శించినాడని చెప్పవచ్చును.

ఖడ్గబంధము-1

[చిత్రము - 3 A]



ఖడ్గ బంధము :- 2

[చిత్రము - 3 ఆ].



ఖడ్గ బంధము - 3

[చిత్రము - 3 ఎ]

# 4. గవాక్ష బంధము

ప్రాచీన కాలమున ఉపయుక్తములైన గవాక్షము వలె చిత్రమును గీసి, అందు పద్యమును కూర్చుట గవాక్ష బంధము.

ఇందు 1,3,5,7,9 అక్షరముల వరకు క్రమముగా గడులు పెరిగి, అనంతరము క్రమముగా 7,5,3,1 పద్ధతిలో క్రమముగా తగ్గిపోవును. ఇట్లు నిలువు అడ్డములలో సమాంతరముగా గడులను గీసి అందు అక్షరములను కూర్తురు. మధ్యవరుసలో గ్రంధనామముకాని, కవినామము కాని, లేదా రెంటినీ కలిపి కాని పొందుపరతురు.

వేంకటాధ్వరి కృత 'లక్ష్మీసహస్ర'మున గల (పుట-372)-

"వేషం కలివికటా శుభహారమార్యత్రాణదం వృషాద్రౌత్వం

శ్రీరయసే కరుణారస పాలిత లోకా హారస్యజస్రమకం॥"

అను శ్లోకమును చిత్రమున కూర్పగా నిలువుగానున్న మధ్య గడులలో 'వేంకటార్య శ్రీసహస్రకం' అని కూర్పబడినట్లు స్పష్టమగును. దానికి అనువాదమైన డా॥ వేదుల సూర్యనారాయణ శర్మగారి 'లక్ష్మీసహస్ర కావ్యము'న గల

"వే వేంకట వక్షోటన
దేవీ! మాతా! మహత్త్వదీప్తి, నిక సుఖి
త్వావాసం బిడుమా నీ
శ్రీవాసాపాంగవినుతి జేసితి జైజై" (చిత్ర-43)

అను కందమున 'వేంకట మఖి శ్రీనుతిజై' అను అక్షరములు పొందుపరుపబడినవి. (చిత్రము-4)

మొత్తము మీద రెంటిలోను కవి-గ్రంధనామములు రెండును కూర్చబడినవి.

# 5. గుచ్ఛ బంధము

పూవులను గుచ్ఛముగా పేర్చినట్లు చిత్రమును గీసి, అందులో అక్షరములను కూర్చిన గుచ్ఛబంధమగును.

అప్పకవి దీనికి –

"గాదిలితో మాలదిగా
గాదిలకించెన్ బదిగా
గాదిబ కృష్ణుండదిగా
గాదిడ వాచాలిదిగా" (అప్ప 4-574)

అను మాణవక వృత్తమును లక్ష్యముగా ఇచ్చియున్నాడు (చిత్రము-5A). అప్పకవి చూపిన లక్ష్యమున ఒక మెళకువ గలదు. పద్యములోని 4 పాదములందును మొదటి 2 అక్షరములును ఒకటే వచ్చునట్లు కూర్పబడినవి. అవే అక్షరములు పాదాంతములందు వ్యత్యస్తములై కూర్పబడినవి. ఇది చిత్రబంధమున చక్కని వెసులుబాటును కలిగించినది. చిత్రములో మధ్యనున్న అక్షరమైన 'గా'కు, 4 వైపులకు గల అక్షరమైన 'ది', ఒక్కటే ఉన్నది. పూలగుత్తిని చేయునప్పుడు మధ్య నున్న పూవునకు చుట్టును ఒకే రకమైన పూవులను కూర్చుట వలన గుత్తికి ఒక అందము వచ్చును. ఆ ఔచిత్యము అప్పకవి లక్ష్యమున పాటింపబడినది.

శ్రీ లక్ష్మీ నృసింహాచార్యులవారును తమ 'వేల్పుగొండ లక్ష్మీనృసింహ క్షేత్రమహాత్మ్యము'న నిచ్చిన

'మారశరీరా మురమా
మారముదబ్ధి సరమా
మారసపత్నారిరమా
మారరిపీ కాశరమా" (వేల్పుగొండ 2-140)

అను మాణవక వృత్తమునను పై ఔచిత్యము పాటింపబడినది. అయితే, అప్పకవీయములోని చిత్రముకన్న వేల్పుగొండ లక్ష్మీనృసింహ క్షేత్ర మహాత్మ్యమున గల చిత్రము సుందరముగా నున్నది (చిత్రము-5B).

ఓగిరాల జగన్నాధ కవి కూడ తన 'సుమనోమనోభిరంజనము'న గుచ్ఛబంధమునకు లక్ష్యమును మాణవక వృత్తముననే ఇచ్చియున్నాడు.

కనుక ఈ గుచ్ఛబంధమునకు 'మాణవక వృత్త'మే అనుకూలమైనదని గమనించవచ్చును.

కాని 'భారతాభ్యుదయము'నందలి గుచ్ఛబంధము 'విద్యున్మాలా వృత్తము'న గలదని ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాస పీఠికలో నున్నది. మాణవక వృత్తమువలెనే విద్యున్మాలావృత్తము కూడ 32 అక్షరముల వృత్తమే కనుక అభ్యంతరము ఉండదు.

మొత్తము మీద నీ గుచ్ఛబంధమున 32 అక్షరములను 17 స్థానములలో కుదింపబడుట గమనింపదగినది.

ఈ గుచ్ఛబంధ విషయమున ఒక నూతన ప్రయోగమును చేసినవారు శ్రీ విక్రాల శేషాచార్యులవారు. వారు వ్రాసిన 'వేంకటేశ్వర చిత్ర రత్నాకరము' (1వ భాగము-94వ పద్యము)లోని

"సారసనేత్రా సురసా
సారసుఖశ్రీతరసా
సారతరాత్మాదరసా
సారదరాఢ్యా సరసా"

అను మాణవక వృత్తమును అష్టదళ పద్మబంధముగను కూర్చుటకు అనువుగా నున్నది (పు. 73లోని చిత్రము).




పుష్పబంధము

[చిత్రము - 58].




గుచ్ఛబంధము

[చిత్రము - 5 B].

# 6. గోపుర బంధము

గోపురములోని ఇటుకలను సూచ్యాకారముగా పేర్చినట్లు, ఈ బంధమున 49 గడులను గీసి, అందు అక్షరములను పేర్చుదురు. అనంతరము గోపుర మధ్యభాగములోని నిలువు గడులను, గోపురము క్రింది భాగమున గల గడులలోని అక్షరములను కలిపి చదువగా కవి చెప్పదలచిన భావము స్పష్టమగును.

నాదెండ్ల పురుషోత్తమకవిగారు తమ 'చిత్రకందపద్య రత్నాకరము'న గోపురబంధమునకు లక్ష్యమును కంద పద్యమున వ్రాసి యున్నారు.

"రామా మహితా మనమున
నీమంబును గొని తలంతు నినుఁగను గతి నీ
నామమునె యనుదు మనుపవె
ప్రేమ న్సతతంబు మీకు భృత్యుండ గదా"

(చిత్రకంద-పు.20)

అను ఆ లక్ష్యమును చిత్రమున కూర్చగా అందు, "రామ నను గనుమీ ప్రేమ న్సతతంబు మీకు భృత్యుండగదా" అను పదబంధము కన్పట్టును (చిత్రము - 6).




గోపుర బంధము
[చిత్రము-6]

# 7. గోమూత్రికా బంధము

కుటిలమై పొడుగుగా గోమూత్రికావిధానమున చిత్రమును గీసి, అందు పద్యమును పొందుపరచిన గోమూత్రికాబంధమగును.

ప్రాచీన కవులును - లాక్షణికులును గోమూత్రికాబంధమును వ్రాసిన పట్లను జాగ్రత్తగా పరిశీలించినచో, సూటిగా ఉన్న అక్షరములతో పాటు, ప్రక్కలయందు కూడ అక్షరములను అచ్చుటచ్చుట కూర్చుట గమనింపవచ్చును. గోవు మూత్రీకరించినప్పుడు సూటిగా కాక, ప్రక్కలలో కూడ పడుటలోని సూక్ష్మత కూడ ఇందు పాటింపబడినది. ముఖ్యముగా పద్యపాదములు మూరు స్థలములలో అది కనిపించును.

మొదట సన్నగా ప్రారంభమై చివర లావుగా అపూర్తియగుట- మొదట లావుగా ప్రారంభమై చివర సన్నగా పూర్తియగుట- ఆద్యంతము లందు సమానముగా ఉండుట - అను భేదములచే ఈ గోమూత్రికాబంధము 3 విధములుగా కనిపించుచున్నది.

అప్పకవీయమున మొదటి రెండింటికి ఉదాహరణము లున్నవి. బహుశః మూడవది సంభవము కాదను దృష్టితో కావచ్చును, అప్పకవి దానిని గ్రహింపలేదు.

మొదట సన్నగా ప్రారంభమై చివర లావుగా పూర్తియైన దానికి -

"వితరణ శూర దయార్ణవ
ధ్రుతచక్రధర నృసింహ ధ్రువశోధిమహా
వితరణ ధీర నయార్ణవ
జితనక్ర పరతరగాహ జీవనధి గృహా"

(అప్ప-4-572)

అను కందపద్యమును, మొదట లావుగా ఉండి చివర సన్నగా పూర్తియైనదానికి -

"కనక నయన వైరీ కాదపాహారవాహా
వనజనయన శౌరీ వాదవాహారివాహా

వనధనదవిధిజ్ఞా పాదసంభూతగంగా
వినయ నరవిధిజ్ఞా' వేదసంభూతగంగా"
(అప్ప-4-572)

అను మాలినీ వృత్తమును లక్ష్యములుగా ఇచ్చినాడు అప్పకవి!

వానిని చిత్రములు - 7A, 7B లలో చూడవచ్చును.

సహజముగానున్న ఈ రెంటినే అప్పకవి గ్రహించుట వలన ఇవే గోమూత్రికాబంధమునకు సరియైన లక్ష్యములనవచ్చును.

ఇక మూడవ విధానమునకు లక్ష్యము 'పారిజాతాపహరణము'న కలదు. అది -

"విదళిత దైత్యరమాగృహ
పదసారసవినతదేవ పతగేశహయా
చిదమిత శైత్య శమావహ
మదవారణ విమతభావ మతపాశజయా" (పారి.5-94)

అనునది. అది 'చిత్రము - 7C 'లో చూడనగును.

ఈ గోమూత్రికాబంధమున ప్రతి రెండవ అక్షరమును ఒకే అక్షరమగునట్లు కూర్చుట వలన గోమూత్రికాబంధ గమనమునకు ఒక గమకము కలుగుచున్నది. ఇలాంటి గమకము అందరి కవుల రచనలలోను గమనింపవచ్చును.

సంస్కృతమున, వేంకటాధ్వరి తన 'లక్ష్మీ సహస్రము'న చిత్ర విచిత్రములైన గోమూత్రికాబంధ విధానములను వివరించినాడు. అట్టివి తెలుగున లేనందున, దానిని ఆంధ్రీకరించిన డా॥వేదుల సూర్యనారాయణశర్మగారు తమ 'లక్ష్మీ సహస్రకావ్యము'న ఆ ప్రక్రియలను యథాతథముగా తెలుగులోనికి తెచ్చి, ఆ లేమిని పూరించినారు. వానిలో 2,3 విశిష్టమైన బంధములు గమనింపదగినవి.

'చిత్రము-7 D'లో చూపిన వేదులవారి లక్ష్యమును పై పంక్తినుండి క్రిందికిని, క్రింది నుండి పై పంక్తికిని, ఒక అక్షరమును వదలి ఒక అక్షరమును కలుపుచు, చదివినచో రెండు పద్యములగుచున్నవి. అవి -

1. కలుములచెలి కరుణాశీ
తలదృష్టి సమస్త వాక్కృతాఘము లొదుగున్
పలుకుల చెలి కరుణా శీ
తలవృష్టి సమగ్ర వాగ్వృతార్థము లెదుగున్
2. పలుకుల చెలి కరుణా శీ
తలవృష్టి సమగ్ర వాగ్వృతార్థము లెదుగున్
కలుముల చెలి కరుణా శీ
తలదృష్టి సమస్త వాక్కృతాఘము లొదుగున్" (పు.213)

అనునవి.

దీని తరువాత సూర్యనారాయణశర్మగారు వ్రాసిన 'భిన్న వృత్తానులోమ గోమూత్రికాబంధము'న రెండు వృత్తములున్నవి. బేసి వరుసలలో (1,3,5,7) వంశస్థవృత్తమును, సరి వరుసలలో (2,4,6,8) ఇంద్రవంశవృత్తమును ఉన్నవి. గోమూత్రికా పద్ధతిలో కూడ రెండు వృత్తములును చదువనగును (లక్ష్మీ సహస్ర కావ్యము - పు. 239).

వేదులవారు వ్రాసిన గోమూత్రికాబంధములలో విశిష్టమైన మరొకటి - 'భిన్న వృత్త అనులోమ ప్రతిలోమ గోమూత్రికాబంధము.' చిత్రము -7 E/ లో చూపిన దాని లక్ష్యములో - పై నుండి బేసి వరుసలను (1,3,5,7) అనులోమముగా చదివిన ఒక వృత్తమును, అట్లే అడుగునుండి బేసివరుసలను విలోమముగా చదివిన మరియొక వృత్తమును వచ్చును. మొదటి పద్యమునకు అనులోమముగా గోమూత్రికాగతియు, రెండవ పద్యమునకు విలోమముగా గోమూత్రికా గతియు నగును. అవి -

a) అనులోమ పద్యము - స్రగ్విణీ వృత్తము -
"వేద భూజాత మా వేంకటేశాంగనా
చేదు మీవేపతిన్ చెంది నేరాగనన్
నీదు సేవావిధిన్ నేను మైనీగనా
గాదె నీవీ/వితో కావగా రావదే-"

b) ప్రతిలోమ పద్యము - చతుష్పద ద్విపద -
విగతిగాక కాచు విధినీదెగా
విగతమైన నేను విధిసేదునీ
ప్రగతి నేను చెంద పతిమీదుచే
తగదటే! వివేక తరుభూమివే -"

అనునవి (లక్ష్మీ సహస్ర కావ్యము - పు. 240).

ఇవికాక డా॥ వేదుల సూర్యనారాయణ శర్మగారు యమకానులోమ ప్రతిలోమ గోమూత్రికాబంధమును ఒకదానిని వ్రాసియున్నారు (చిత్రము-7F). భద్రక వృత్తముననున్నది ఆ లక్ష్యము. పద్యములోని మొదటి అర్ధభాగమును (1,2 పపాదములను) ప్రతిలోమముగా చదివిన 3, 4 పాదములగుట అర్ధభ్రమక యమకము కాగా, దానిని అనులోమ ప్రతిలోమ గతులలో గోమూత్రికా బంధము కూడ అగుచున్నది.

ఇట్లు తెలుగునలేని ఈ అపూర్వ ప్రక్రియలను శ్రీ వేదులవారు తెలుగులోనికి తెచ్చి ఆ లేమిని పూరించినారని చెప్పవచ్చును.

ఈ గోమూత్రికా బంధమున గమనింపవలసిన విషయమొకటి యున్నది. అది - ఈ బంధరచనమునకు ఏ పద్యమైనను అనుకూలమైన దేయనుట. అప్పకవీయమున మాలినియు, పారిజాతాపహరణమున కందమును, బిల్వేశ్వరీయమున శార్దూలమును, లక్ష్మీ సహస్ర కావ్యమున భద్రక - ఇంద్రవంశ - వంశస్థ - స్రగ్విణీ - చతుష్పద ద్విపదాదులను ప్రయోగింపబడుట గమనించినచో పరిమితాక్షరములు గల పద్యము లేవియైనను ఈ గోమూత్రికాబంధమునకు అనువైనవే యన్న విషయము స్పష్టమగును.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | లు | ము | ల | చె | లి | క | రు | ణా | శీ | త | ల | దృ | ష్టి | స | మ | స్త | వా | క్య | లా | ఘ | ము | లా | దు | గున్ |
| ప | లు | కు | ల | చె | లి | క | రు | ణా | శీ | త | ల | వృ | ష్టి | స | మ | గ్ర | వా | గ్వ్య | లా | ర్థ | ము | లె | దు | గున్ |

గోమూత్రికా బంధము - 4

[ చిత్రము - 72 ]

| | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మా | స | వా | స | ర | స | రా | స | మా | మా | స | రా | స | ర | స | వా | స | మా |
| మా | స | వా | స | ర | స | రా | స | మా | మా | స | రా | స | ర | స | వా | స | మా |

అర్థభ్రమ యమకానులోమ ప్రతిలోమ గోమూత్రికా బంధము- 6

[చిత్రము - T F ].

# 8. చతురంగ బంధము

చతురంగము వలె గడులను గీసి, అందు పద్యమును ఇముడ్చుట చతురంగ బంధము. దీనిలో గడుల సంఖ్య నియతముగా నుండుట వలన, కవులు దానికి అనుకూలముగా 64 అక్షరములుండు విద్యున్మాలా వృత్తమునో, కందమునో స్వీకరించుట గమనార్హము.

నాదెళ్ల పురుషోత్తమ కవిగారు తమ 'చిత్రకందపద్య రత్నాకరము'న 2 చతురంగ బంధములను వ్రాసినారు (పుటలు-4,21). ఆ రెండును కందపద్యములేకాక, సర్వ లఘు పద్యములై యున్నవి. కంద పద్యము మాత్రాగణబద్ధమైనది కావున, అన్నిలఘువులు కానిచో అక్షర సంఖ్యతగ్గి పోవు అవకాశమున్నది. ఆ ఇబ్బంది కలుగకుండుటకుగాను పురుషోత్తమ కవిగారు అన్నీ లఘువులనే వాడినారు. అయితే కందపద్యమునకు 2,4 పాదముల చివర నుండవలసిన గురువులు పొల్లక్షరములతో పూరింపబడినవి. మరొక విశేషము - 4వ వరుసలోని చతురంగ బంధమున 2వ వరుసలో 'పురుషవరుడు; 4వ వరుసలో 'కవితను', 7వ వరుసలో 'శివుని బొగడుట' అనునవి పొందుపరుపబడినవి అట్లే 21వ పుటలోని - 'రామస్తవ' చతురంగబంధమున -

"నగు మొగమున నసుభవమయి
తగు మిగుల రహియె యసమ పదదుడవన నొగిన్
బగరకు బలముడుపులఘుత
బొగరడగు రవయు నొదవవు పురికొనువలనుల్ -

అను పద్యమున్నది. దాని మూలలో - ముందు పై నుండి క్రిందికిని, క్రింది నుండి పైకిని గజ్జపు గతులందు క్రమముగా 'వరదుడ,' 'రఘువర', 'వరముల', 'నొసగుమి' అను పదములు పొందుపరుపబడి యున్నవి (చిత్రము-8A).

వేంకటాధ్వరి తన 'లక్ష్మీ సహస్రము'న ఒక చతురంగ బంధమును వ్రాసినాడు. ఆయన వ్రాసిన -

"రమావరాభితా పాపా, నీరజోదర పాద్యహా!

నయాసమాభయా భామా, సావనాతాప మస్యతు" (22-25)
అను ఆ చతురంగబంధ శ్లోకమును రెండుసార్లు ఆవృత్తము చేయగా అందలి తురంగ పదగమనములోని అక్షరములన్నింటిని కలిపినచో-

"రజోభిద్యతు యాతాయా
వరపామా మమావనీ
ససార రాభస్యహితా
భాసాపావదమాననా" (22-26) -

అను మరొక శ్లోకము రెండుసార్లు ఆవృత్తమగును. అసలు సరియైన చతురంగబంధవిధానము ఇదియే యనిపించుచున్నది. సరస్వతీ కంఠాభరణమున (చిత్రప్రకరణము - 40 శ్లో) గల లక్షణమును గమనించినచో ఇది స్పష్టమగును.

వేదులవారు 'లక్ష్మీ సహస్రకావ్యము'న అక్షర సంఖ్యా నియమము గల విద్యున్మాలా వృత్తమును స్వీకరించి, గడులను నింపుటలో కంద పద్యమున కలుగు ఇబ్బందిని అధిగమించినారు. మూలము నందువలెనే తాము కూడ 32 అక్షరములున్న

"రారా రావా రాధా తామా
ధ్యారామాభా మా కామారా
జే రాజాతా సారాభాపో
మా రాజేమా ధీపేతామా" -

అను విద్యున్మాలా వృత్తమును రెండుసార్లు ఆవృత్తము చేసి, అందలి గుఱ్ఱపుదాటు గదులలోని అక్షరములను కలుపుకొనగా -

"రామా రామా మారా మారా
రామా తాపోపేతా రాధ్యా
జామా రావా సాతా రాధా
భామాకాధీ భారా జేజే" -

అను మరొక విద్యున్మాలావృత్తము (పుట-228) రెండుసార్లు ఆవృత్తమగునట్లు వ్రాసినారు (చిత్రము-8B)

ఇట్లు ఈ చతురంగ బంధమున కవులు తమ సామర్థ్యమును ప్రకటించియున్నారు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| న | గు | మొ | గ | ము | న | న | ను |
| భ | వ | మ | యి | త | గు | ణి | గు |
| ల | ర | శా | మె | య | స | మ | ప |
| ధ | దు | ఉ | వ | న | నా | రి | స్ |
| ఒ | గ | ర | కు | బ | ల | ము | డు |
| పు | ల | ఘు | త | జా | గ | ర | డు |
| గు | ర | వ | యు | నా | ర | వ | పు |
| పు | రి | కొ | ను | వ | ల | ను | ల్ |

చతురంగ బంధము

[చిత్రము - 8 A].

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| రా-1 | రా-30 | రా-9 | వా-20 | రా-3 | ధా-24 | లా-11 | మా-26 |
| ధ్యా-16 | రా-19 | మా-2 | భా-29 | మా-10 | కా-27 | మా-4 | రా-23 |
| జే-31 | రా-8 | జా-17 | లా-14 | సా-21 | రా-6 | భా-25 | షో-12 |
| మా-18 | రా-15 | జే-32 | మా-7 | ధీ-28 | పే-13 | లా-22 | మా-5 |
| రా-33 | రా-62 | రా-41 | వా-52 | రా-35 | ధా-56 | లా-43 | మా-58 |
| ఖ్యా-48 | రా-51 | మా-34 | భా-61 | మా-42 | కా-59 | మా-36 | రా-55 |
| జే-63 | రా-40 | జా-49 | లా-46 | సా-53 | రా-38 | భా-57 | షో-44 |
| మా-50 | రా-47 | జే-64 | మా-39 | ధీ-60 | పే-45 | లా-54 | మా-37 |

# 9. చక్రబంధము

చక్రబంధమును గూర్చి ప్రాచీన లాక్షణికులు చెప్పిన విషయమును పరిశీలించిన షడర చక్రబంధమే అతిప్రాచీనమైనదని స్పష్టమగును. కాకతీయ ప్రభువైన గణపతి దేవ మహారాజు క్రీ.శ.1245లో వేయించిన వర్ధమానపుర శాసనమున

నిత్యం గుంభిత మత్రనామ సదృశా కార ప్రచారా స్పృశా
నక్రోడ ద్విపయూపగేషుసరసక్ష్మాచిత్రసానుప్రహాదం।
మన్యేవీర్య కరప్రశస్తి సదనం నీతం యశోతిక్షమా
మానాఖ్యానిగదం నయస్థమలికం శాభిష్వదంతం రమా॥

(తెలంగాణ శాసనాలు -II-పుట 114)

అను శార్దూల వృత్తము ఉన్నది.

భోజుడు 'సరస్వతీ కంఠాభరణము'న చెప్పిన లక్షణమును ఇందుకు నిదర్శనము. అది మొదటి 3 పాదములు 3(6) అరలందు ఒదుగగా, 4వ పాదము చక్రనేమియందు ఒదుగును (చిత్ర-33).

ఇట్లే శ్రీమండపాక పార్వతీశ్వర శాస్త్రులవారును తమ 'ప్రబంధ సంబంధ బంధ నిబంధన గ్రంథము'న (8వ పద్యము) శార్దూల విక్రీడిత పద్యములోని మొదటి 3 పాదములును చక్రారలందు నింపి 4వ పాదమును చక్రనేమియందుంచవలెనని నిబంధించినారు.

సాధారణముగా 10 వలయములను, కర్ణికలో ఒక అక్షరమును నిలిపి, పై 10 వలయములలో 10 అక్షరములను, క్రింది 10 వలయములలో 10 అక్షరములను కూర్తురు. ఇట్లు ప్రతి అరకు 21 అక్షరముల చొప్పున ఉండుటవలన, కవులందరును చక్రబంధ నిర్మాణమునకు శార్దూల విక్రీడితమునే స్వీకరించినారనవచ్చును.

ప్రాచీన లాక్షణికులును - కవులును శార్దూల విక్రీడితమునే గ్రహించి చక్రబంధమును వ్రాసినారు. కుమారసంభవము (12-200), బిల్హణీయము (1-133), రాఘవ వాసుదేవీయము (బిల్హణీయానుబంధము-2) అప్పకవీయము (4-586), అద్భుతోత్తర రామాయణము

(7-153), బిల్వేశ్వరీయము (6-85) మొదలైన గ్రంథములన్నింటి యందును ఈ చక్రబంధమునకు శార్దూలమే ఉపయుక్తమైనది.

అప్పకవీయములోని-

"భద్రాకాముక సోమ సూర్య నయనా భ్రాజిష్ణు శౌర్యక్రమా
క్షుద్రాక్రుద్ధ విమర్శితాంగన తతాస్తోక ప్రసంపత్కరా
భద్రానూన జయావహా వినయవాగ్భా విష్కృతాయక్షమా
మాద్రీశాభవతక్షుకా శుభకరా మాంగల్య రాసోద్యమా" (4-586)

అను లక్ష్యములోని 3వ వలయమున 'కాక్రునూర్యవయ' అనియు, 6వ వలయమున 'సోమయాజి కవి' అనియు నిబంధింపబడినవి (చిత్ర-9A).

ఈ షడరచక్రబంధమును ఆధారముగా చేసికొని కొందరు కవీశ్వరులు 'అష్టారచక్రబంధము'ను నిర్మించినారు. ఇందును శార్దూల విక్రీడితమునే గ్రహించుట గమనార్హము. కాగా షడరచక్రబంధమున చక్రనేమియందు ప్రతి అరకు నడుమ రెండు రెండు అక్షరములు కూర్పబడగా, ఈ అష్టార చక్రమున అవి 8 అరలలోనే ఇమిడిపోయి అష్టారచక్రబంధమేర్పడినది.

వేంకటాధ్వరి తన 'లక్ష్మీ సహస్రము'న ఇచ్చిన అష్టారచక్రబంధమున -

"ఆర్తంవేదయ మీద్యసారమహిమ శ్రీవత్స గౌకస్స్పృశ
త్రేతాంతకస్థిర మాన్తనుత్వ మమలాప్తాతం గిరింపీడ్సపా
యత్రాటానల సప్రతాపమచలద్దాసే హరీందుస్థలే
వంద్యార్య వ్రజ కల్పక క్రమతయా జ్ఞాన ప్రదానాసినా"
(లక్ష్మీ - పు. 370)

అను శ్లోకమున్నది. అందు-1,3,6,8 వలయములలో వరుసగా కవివంశము (ఆత్రేయ వంశపాలేనా), పేరు (వేంకటార్యకవీందునా), గుణము (మీమాంసక వతంసేన), క్రియ (సానుతా కమలాలయా) - అనునవి కూర్పబడినవి (చిత్రము-9B)

డా॥వేదుల సూర్యనారాయణ శర్మగారి లక్ష్మీసహస్రకావ్యమున రచించిన -

"ఆదిధ్యేయరమా ప్రశానసమహితా జాతా భాగ్యదాయామశ్రీ

యాదేయున్ హృదయాలయున్ శమములన్ బ్రారబ్ధమున్
జించుశ్రీ
త్రేదున్ వేంకటపాదుఁ బ్రోవు మహిరా ట్ఛిద్వారు వేశర్మమా
యాదాకట్ కటయీ భవంబు మటమాయన్ జార్చి కర్మన్ ననున్"

అను పద్యమున (పుట-237) మరొక వైచిత్ర్యము ప్రదర్శింపబడినది. 1,3,6,8 వలయములలో వరుసగా నామ, గుణ, ప్రార్థనలను చెప్పుకొనుటయేగాక, ఆ వలయములను వరుసగా వ్రాసినచో -

'ఆ యాత్రేయ శ్రీశ్రీ మానున్
ధ్యేయున్ వేంకట్యాజిం శర్మన్
మాయా పాయీ భారద్వాజా
శాయున్ బ్రోవన్ జాలన్ రామా" -

అను విద్యున్మాలా వృత్తము వచ్చును. ఇట్టి ప్రజ్ఞ నాన్యతో దర్శనీయము! (చిత్రము-9C).

భోజుడు తన 'సరస్వతీ కంఠాభరణము'న మరికొన్ని చక్రబంధ ముల నిచ్చియున్నాడు. అవి - ద్విచతుష్క, ద్విశృఙ్గాటక, వివిడిత చక్ర బంధములు.

శిఖరములను సంధులను వరుసగా కలుపుచు చక్రనేమియట్లు అక్షరములను కూర్పవలెను. అట్లు రెండుసార్లు ఆవృత్తము చేసినచో 'ద్విచతుష్క చక్రబంధ'మగును (సరస్వతీ-చిత్ర-43). దీనికి వేంకటా ధ్వరి కృత 'లక్ష్మీ సహస్రము'న (పుట-349) ఒక ఉదాహరణము కలదు. శ్రీ వేదులవారి 'లక్ష్మీ సహస్రకావ్యము'న గల -

"భజింతు శ్రీదేవిన్ భక్తిన్
త్యజింతు సంసారాసక్తిన్
సృజింప శ్రీభావిన్ రక్తిన్
యజింతు సంభారా శక్తిన్" (22-18) -

అను విమాన వృత్తమును 'చిత్రము-9D'లో చూడనగును. దీనికి మరొక లక్ష్యము శ్రీ వేదాంత దేశికుల 'పాదుకా సహస్రము'న కలదు (926వ శ్లోకము).

శ్రీ వేదులవారు రచించిన ద్విచతుష్క చక్రబంధమును గోమూత్రికాబంధముగా కూడ వ్రాయుటకు వీలుగా నున్నది. అది వారి ప్రజ్ఞకు మరొక నిదర్శనము (పుట-221).

శృంగము నుండి గ్రంథికిని, తిరిగి గ్రంధినుండి శృంగమునకును అక్షరములను కూర్చుచు పోయి, మిగిలిన శ్లోకార్థాక్షరములను నేమియందు కూర్చుట 'ద్విశృఙ్గాటక చక్రబంధము' (సరస్వతీ-చిత్ర-44), దానికి భోజుడే ఇచ్చిన లక్ష్యమను -

"కరాసంజవనే శంఖ గౌరవస్య కళారసం।
సంధాయ వలయాం శంకా మగౌరీం మేవనాత్మక॥" -

అను శ్లోకమును చిత్రబంధమునకూర్చి, గ్రంధులందలి అక్షరములను వరుసగా చదివినచో 'రాజశేఖరస్య' అను పదబంధము గోచరించును. (చిత్రము-9E) దీనికి మరొక లక్ష్యము శ్రీ వేదాంతదేశికుల 'పాదుకా సహస్రము'న (925వ శ్లోకము) కలదు.

వేంకటాధ్వరి తన 'లక్ష్మి సహస్రము'న మరొక రకమగు ద్విశృంగాటక చక్రబంధము నిచ్చియున్నాడు. ఇందు రెండు చక్రములలో అక్షరములు కూర్చబడినవి. దానికి ఆంధ్రానువాద ప్రాయమైన శ్రీవేదుల వారి 'లక్ష్మి సహస్రకావ్యము'న గల -

"రారా మావే రారే సంసా
రా రణ్యాప్లుత్ రాగోద్దామా
మారెవ్వార్ రామాతాసంస్ఫు
త్యారాధ్యా వాణ్యాధ్యారారా"- (పుట-220) -

అను పద్యము రెండవరకవు ద్విశృంగాటక చక్రబంధమునకు లక్ష్యము. (చిత్రము -9E)

శృంగము నుండి ప్రారంభించి గ్రంథులను కలుపుచు మరొక శృంగము వరకు పోయి, అచ్చటినుండి తిరిగి అదే పద్ధతిలో ఇతర శృంగములు కలుపుచు అక్షరములను కూర్చవలెను. మిగిలిన అర్థశ్లోకమును నేమియందు నింపవలెను. అది 'వివిడిత చక్రబంధము'. (సరస్వతీ-చిత్ర-45) దానికి భోజుడే ఇచ్చిన లక్ష్యమగు -

"సాసతీ జయతా దత్ర సరంతీ యమితాత్ర సా।
సారంపరం సచ జయా శమితాஉ స్యందనేన సా॥ -

అను దానిని 'చిత్రము-9G'లో చూడనగును.

వేంకటాధ్వరి కృత 'లక్ష్మీ సహస్రము'న 'గరుడగతి చక్రబంధ' మొకటి గలదు. దానికి అనువాద ప్రాయమైన శ్రీవేదుల వారి 'లక్ష్మీ సహస్ర కావ్యము'న (పుట-227) -

"మాతా యీవే భూజాతా సీ
తాతాయీ భూజాతా సీమా
మాతా పాతాపా యీవే ప్ర
స్ఫీతా గ్ర్యానంతార్థశ్రీమా" -

అను లక్ష్యమీయబడినది. గరుత్మంతుని గమనము వంటి పద్ధతిలో కూర్పబడిన ఆ అక్షర విన్యాసమును '9H-చిత్రము'లో చూడవచ్చును. దీనికి 'పాదుకా సహస్రము'న (924వ శ్లోకము) మరొక లక్ష్యము కలదు.

అప్పకవి తన 'అప్పకవీయము'న 'షోడశదళ చక్రబంధ'మను దానిని నొకటి ఇచ్చియున్నాడు. అది -

"రామ రాత్రి రాగ రాధా
రామ రాణా రాక రానా
రామ రాజీ రాచరాజా
రామ రాజీ రావు రాచన్" (అప్ప.4-592) -

అను సింహరేఖావృత్తమున నున్నది. ఇందు అక్షరములన్నియు చక్రనేమియందలి 16 దళములలో కూర్పబడినవి. అందలి ప్రతి రెండవ అక్షరమును ఒక్కటే అగునట్లు కూర్చుటవలన 32 అక్షరముల వృత్తమును 17 అక్షరములలో కుదింపబడినది (చిత్రము-9I).

'రాఘవాభ్యుదయము'న (1-211) చింతలపల్లి ఛాయాపతి 'కులాలికా చక్రబంధము' పేర మరొక బంధమునిచ్చియున్నాడు. దాని చిత్రము నూహింపవలసియున్నది.

ఇట్లు ప్రాచీన లాక్షణికులును కవులును ఈ చక్రబంధ విషయమున అనేక ప్రయోగములను చేసి తమ ప్రావీణ్యమును ప్రదర్శించి యున్నారు.



అష్టార చక్ర బంధము
[చిత్రము - 9 B].

1. కవిబంధము. 2. కవినామము. 3. గుణము. 4. క్రియ.



ద్విశృంగాటక చక్రబంధము

[చిత్రము-౧౬].



ద్విశృంగాటక చక్రబంధము

[చిత్రము - ౯ F].



గరుడగతి చక్రబంధము

[చిత్రము-9 A].



షోడశదళ చక్రబంధము

[చిత్రము-౧౬].

# 10. ఛత్ర బంధము

ఛత్రమును గీసి, అందలి దండమునను ఛత్రమునను అనులోమ విలోమ గతులలో, చదువుటకు అనుకూలముగా, అక్షరములను కూర్చుట ఛత్రబంధమగును.

అప్పకవి దీనికి లక్ష్యముగా -

"సారద మదనక వసుధర
దారద సమసమ సనాస దర మారీచా
చారీ మార వరాకా
కారా వరదార ధసువ కనదమదరసా" (అప్ప 4-573)

అను కందపద్యము నిచ్చియున్నాడు (చిత్రము-10 A).

చింతలపల్లి ఛాయాపతి తన 'రాఘవాభ్యుదయము'న (2-258) ఛత్రబంధమును కందముననే విరచించియున్నాడు. కాని ముద్రితప్రతిలో అది సరిగా నున్నట్లు అనిపించుటలేదు. అందు గణభంగమగుటయే కాక చిత్రమునను సరిగా ఇముడుట లేదు. దానిని -

"సారసహారీ నయయజ
వీర విసర సరసభాస విరసారీనా
నారీసార కరీనా
నారీ కరవీజయయన రీహాసరసా" -

అనువిధముగా చదివినచో ఆ దోషములు తొలగిపోవునని నాభావన.

ఇట్లే గణవరపు వేంకటకవి కృత 'ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము'లోని ఛత్రబంధకందము కూడా (859వ పద్యము) చిత్రమున సరిగా ఇముడుట లేదు. నేటి ముద్రిత ప్రతిలో (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ - 1977) తప్పుగా నున్న అక్షరములు సవరింపవలసి యున్నది.

ఛత్ర బంధమునకు కందమును ఉపయోగించుట ప్రాచీన లాక్షణికుల మతమై యుండగా, శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు తమ 'ప్రబంధ సబంధ బంధ నిబంధన గ్రంధము'న ఒక సీస పద్యమును వ్రాసి

యున్నారు. అది తాము రచించిన 'కాశీ విశ్వనాథ శతకము' నందలి దనియు, అందు నిరోష్ఠ్యాది బంధ-శతములున్నవనియు, వ్రాసియున్నారు. కాని ఆయన ఇచ్చిన చిత్రమున కొన్ని అక్షరములు చిత్రమునకు వెలుపల కూడ వ్రాయబడుట వలనను, అవి ఛత్రబంధ చిత్రమున ఒదుగకయుండుటవలనను అది సరియైన లక్ష్యముగా కనిపించుటలేదు.

శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య శర్మగారు తమ 'ఆంధ్ర మహోభ్యుదయము'న 'శ్వేతచ్ఛత్రబంధ'మను నొక నూతన ప్రయోగమును చేసియున్నారు (ద్వితీయభాగము-5 ప్రక-కాశీమహోత్సవము-4,5 పద్యములు). అందు -

దోధకము ॥ సేవనవశ్య వశీకృతభర్గా
వావిరి విశ్వ విపాకద కల్యా
శైవద రక్తి రసా రమణీయా
దీవన వేడెద దీధితి నిమ్మా!

సుగంధి ॥ సారహీర హార కల్ప సాలచేల ఖాలతా
తారకాధినాథమౌళి దత్తశస్త్రశోభితా
తారకారి మాతదీర్ఘ చైత్యయుద్ధరాజితా
తార సాన గెల్పు నిమ్ము దానధర్మధీయుతా!" -

అను రెండు పద్యములు పొందు పరుపబడియున్నవి (చిత్రము-10 B).

ఈ చిత్రబంధము కూడ చూచుటకు సమంజసముగా నున్నను, శాస్త్రీయముగా కనిపించుటలేదు.

మొత్తము మీద ఛత్రబంధమునకు కందపద్యమే అనుకూలముగను, శాస్త్రీయముగను కనిపించుచున్నది.




ఛత్ర బంధము

[ చి.త.,కు-10 A]



శ్వేతచ్ఛత్ర బంధము

# 11. త్రిశూల బంధము

త్రిశూలమును చిత్రించి, అందు అనులోమ విలోమ గతులలో చదువుటకు అనువుగా అక్షరములను కూర్చినచో త్రిశూలబంధమగును.

గణపవరపు వేంకటకవి తన 'ఆంధ్రకౌముది'లో (పు-36) త్రిశూలబంధమునకు –

"ఘనాఘనాతి కాంతి కాంత కాంచనాక్షశాసనా
జనాసశాక్ష నాక్ష శాసనా జపాలకా ఘనా
ఘనా వనా వనాఘనాఘ కాలపాకనాశనా
ఘనా ఘనా శనాక పారిఖండనా రమాధవా"–

అను పంచచామరమును లక్ష్యముగా నిచ్చియున్నాడు. దానిని 'చిత్రము-11'లో చూడనగును.

ఈ త్రిశూల బంధమునకు మరొక లక్ష్యము వేంకటకవిదే అయిన 'ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము'న (858వ పద్యము) చూడనగును. అదియును పంచచామరముననే ఉండుట గమనార్హము.

# 12. నాగబంధము

తలయును తోకయును వెలుపలికి వచ్చి, మెలిగొన్న పామువలె చిత్రమును దించి, 84 నిలయములందు అక్షరములను కూర్చిన నాగబంధమగును (అప్ప 4-575).

దానికి లక్ష్యముగా అప్పకవి -

"ద్యుతిధర దేవకీ తనయ తోయభవస్తుత భూరమేశ సం
మితగుణ సారభూతి దయ మేయ బృహజ్జన పూరుపావనా
జితనరకా పురాతన యజేయ సువిష్కర భారవాహ శా
శ్వత పురుహూత పీత దవపావక శస్త్రపురాణకోవిదా" - (4-576)

అను చంపకమాలా వృత్తము నిచ్చియున్నాడు (చిత్రము - 12 A)

ప్రాచీన లాక్షణికులును కవులును ఈ నాగబంధ విషయమున చంపకమాలా వృత్తమునే ఉపయోగించినారు. కుమారసంభవము (10-84), పారిజాతాపహరణము (5-95), గణేశ్వరీయము (2-53) రాఘవాభ్యుదయము (5-215), ఆంధ్ర మహాభ్యుదయము (1-15, 5-6) సమీర కుమార విజయము, కవిరాజ మనోరంజనము మొదలగు గ్రంథము లన్నింటియందును చంపకమాలా వృత్తమే ప్రయుక్తమైనది.

నాగబంధమున అక్షరములు నింపవలసిన నిలయములు 84 కనుక, కొందరు కవులు చంపకమాలకు బదులుగా అదే అక్షర సంఖ్యా నియమముగల స్రగ్ధరావృత్తమును గ్రహించియున్నారు. లంకా విజయము (1-181), గోపీనాథ రామాయాణము, దశావతార చరిత్రము లందు స్రగ్ధరావృత్తము ప్రయుక్తమైనది.

ఈనాగబంధ చంపకమాలలో ఇతర పద్యములను కూడ గర్భితము చేసిన లబ్ధప్రతిష్ఠుడు గణపవరపు వేంకటకవి. అందుకు ఆయన వ్రాసిన 'ప్రబంధ రాజవేంకటేశ్వర విజయవిలాసము'లోని 'ప్రమితాక్షర వృత్తకందగర్భిత నాగబంధయుక్త చంపకమాలికా వృత్తము' చూడనగును.

"చ॥ ఘనఖగరాజమానహయ గాయ గదాస్థిర నాగభోగహా
జన జగతీతలేన వర సారక నన్నిజ భోగ మోదనా

ననగవాహలూన భయన్యాయగ తీవ్రతరాగ దీన పా
యనయగ ధీర మాన జయదా యరి గర్వహరా గవాతిగా"

అను ఆ నాగబంధ చంపమాలికావృత్తమున -

1. గర్భిత ప్రమితాక్షర - ఖగరాజమాన హయ గాయ గదా
జగతీతలేన వర సారకన
న్నగవాహలూన భయ న్యాయగతీ
యగధీర మాన జయదా యరిగా -

2. గర్భిత కందము - ఖగరాజమాన హయగా
యగదస్థిర నాగభోగ హాజన జగతీ
నగవాహలూన భయన్యా
యగ తీవ్రతరాగ దీన పాయన యగధీ -

అను రెండు వృత్తములు గలవు. ఇట్లే అందలి 'మహానాగబంధము' (831)న మంజరి, ఆటవెలదులు గర్భితములై యున్నవి. దీని చిత్రరచనా విధానము ఊహింపవలసియున్నది.

అట్లే శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య కవిగారు వ్రాసిన 'నాగాభరణము'న ఒక కందము గర్భస్థమై యున్నది (చిత్రము-12B).

"జయ శివ నామధేయ శుభ సంభవ నిశ్చల భావధీశుభాన్
జయ జగదావనా యఖిల జాలహరస్థమతీ దయానిధీ
జయ భవ పూతకాయ నుత శాంతవరస్తవ భావనారతా
జయ సదనాలయా యచల శాలవ సుస్థిత నాగధారణా" -

అను ఆనాగబంధ చంపకమాలలో (1-146) -

"శివనామధేయ శుభ సం
భవనిశ్చల భావధీ శుభాన్ జయ జగదా
భవ పూత కాయనుత శాం
తవరస్తవ భావనారతా జయ సదనా !" -

అను కందము గర్భితమైయున్నది. ఈ 'నాగాభరణము'న నాగాభరణుడైన ఈశ్వరుని స్తుతించుట ఔచిత్యవంతముగా నున్నది.

'గణేశ్వరీయము'న గల నాగబంధ చంపకమాలలో (2-53)

'విజయరవయుయకవి', 'గణపతికృతి' అనియు అక్షరవయులు కూర్పబడినవి.

తిరుపతిలోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున రావికొండ భూపతి కృతమైన 'చిత్రకవిత్వ దర్పణ'మను నొక వ్రాతప్రతి గలదనియు, అందు 'అష్టకోణఫణి - నవకోణఫణి' అను రెండు నూతన నాగబంధములు కలవనియు, వాని ఆకారములను తామూహించి లిఖించితిమనియు చిత్రకవిత్వముపై పరిశోధన చేసిన శ్రీగాదె ధర్మేశ్వరరావుగారు నాకు వ్రాసి పంపిన వివరములను క్రింద పొందుపరచుచున్నాను.

a) అష్టకోణపణి -

"రామ సరాగ (దే)వ కవిరాండ సవర్ధిక బ్రోవవే దయన్
భామితరీతి ద్రోయు రసభావుకలీల వహింపదేవ శ్రీ
భూమహిళావలా వినత పోషణ దక్షయుతాగశాలి స
త్కోమలి -వ- కరహి గోపచ దన్యు విభూతిసాదరా"

అను ఉత్పమాలావృత్తమున గలదు (చిత్రము-12C). ఇందలి కోణాగ్రములందు 'రావుకొండభూపభాష' అను అక్షరములు పొందుపరుప బడియున్నవి.

b) నవకోణఫణి -

"మురారి వీర దర్పహా ప్రముగ్ధ వాద ధీచణా
ప్రరావర ప్రణప్రమదత్త భావకా - వేదరీ
హారీ పదప్రేదక్షమా ముఖారవింద పద్మప
-------- ప్రమోద శస్త్ర భూవరేంద్ర దండముల్" -

అను పంచచామరమున గలదు. దీని కోణములందు "మురహారచరణ స్తవము" అను అక్షరములు పొందుపరువబడియున్నవి.

నాకు లభించిన కొన్ని వ్రాత ప్రతులలో రెండు క్రొత్త నాగబంధములు కనిపించినవి. అవి -

**a) కుండలాకార నాగబంధము :- అందు -**

**"వారిజ లోచన నరహరి**

వారిజధర కనకవసన-భవభయహరణా
శ్రీరమ్యధీరమారా
కారా బుధజన వినత సకల భువన ధవా !" - (చిత్రము-
12 D) అను కందపద్యము కలదు.

b) కుండలిత నాగబంధము :- అందు -
"భవ భయ భవ భరిత జన వి
భవ దాయక నంబులగిరి పరిచిత జిత దా
నవహార పరతర సురుచిర
నవ కమలజ నయన శుభద నరహరి కనవా! (చిత్రము-
12 E) అను కందపద్యము కలదు.

పై రెండు బంధములును కందముననే యున్నవి. కాని నాగబంధమునకు కందపద్యము నుపయోగించుట సంప్రదాయము కాకపోవుటవలనను, చిత్రములందు పొందుపరుపబడిన అక్షరములలో సమాక్షర విన్యాసము లోపించుటవలనను, ఆధునికములైన ఈ నూతన బంధములు సమంజసముగా తోచుటలేదు.

ఈ నాగబంధమున ఒకటికన్న ఎక్కువ నాగములు పెనవేసి కొన్నట్లు చిత్రించి, తమ ప్రతిభా పాండిత్యములను చాటుకొన్న కవివర్యులను లేకపోలేదు.

శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య కవిగారు తమ 'ఆంధ్ర మహాభ్యు దయము'న వ్రాసిన ఈశ్వర ప్రార్థనము 'ద్వినాగబంధము'నను న్నది (చిత్రము-12 F). అది -

"దేవ సత్యరమా సాద్య దీన రక్షా
సజ్జ నానంద సందీప్త సారశూర
నిత్యభక్త గణావన నీతి గణ్య
భవ్యనామదయానీత వర్యశూలి" - (1-143) -
అనునది.

నాగబంధములలో అత్యద్భుతమైన చిత్రము శ్రీ రంగాచార్యగారు వ్రాసి పంపినది. అది 'అష్టనాగబంధము' (చిత్రము-13G). అందు 8

నాగములు పెనవేసికొన్ని యున్నవి. ప్రతి దిక్కునకు రెండు రెండు తలలుండునట్లు 4 దిక్కులందును 8 సర్పములు కూర్పబడినవి. వాని తోకలు ఒక్కొక్క మూలకు రెండు రెండు వచ్చునట్లు 4 మూలలోను కూర్పబడినవి. అన్ని నాగములును ఒక నిర్ణీత పద్ధతిలో పెనవేసికొని యున్నవి. ఆ నాగములు ఒకదానితో నొకటి కలియు చోట్ల ఏర్పడిన మెలికలలో కూర్పబడిన అక్షరములన్నియు, అన్ని నాగములకు సరిపోవునట్లు కూర్పబడినవి. ఈ 8 నాగములలోను ఉన్నది ఒకే ఒక కందపద్యముగుట విశేషము. అది –

"శ్రీ రమణ మురముదాంబుజ
వార ద్విజ రాజసార వాతజరక్షా
నారద కిల్బిష హరవర
సూరిగణస్వాంత తోష శూర ముకుందా !" –

అనునది. ఈ కందపద్యమే 8 సర్పములకు తలనుండి తోకవరకును సరిపోవును. ఇది ఎవరు వ్రాసినారో తెలియదు. కాని, మొత్తము మీద చిత్రకవితలోనే ఇది శిఖరాయమానమైనదని చెప్పవచ్చును. ఇట్టి ప్రజ్ఞాపాటవములు నాన్యతో దర్శనీయము!

ఇట్లే నాగబంధము కవుల ప్రజ్ఞకు నికషోపలముగా నిలిచినది!



చ. ద్యుతిధర దేవకీతనయ, తోయిభవస్తుత భూరమేశ సం
మితగుణసారభూలిప య, నేయబృహజ్జవపూరుషావనా
శితనరకా పురాతన య, శేయసువిష్క్రరభారవాహ శా
శ్వతపురుహూత పీతదవ, పావక శస్త్రపురాణకోవిదా.

నాగబంధము
[చిత్రము-12 A].



నాగబంధము

[చిత్రము-12 B].



అష్టకోణ ఫణి

[చిత్రము-128].



కుండలాకారచిత్రబంధము

[చిత్రము - 12 D].



కుండలితనాగబంధము

[చిత్రము- 12 E].



ద్వినాగ బంధము - ఈశ్వర ప్రార్థన



అష్టనాగ బంధము
[చిత్రము-౧౨౯].

# 13. పద్మ బంధము

పద్మ బంధమునకు కమల బంధమనియు నామాంతరము.

పద్మబంధమును దాదాపు లాక్షణికులందురుని చెప్పియున్నారు. కనుక ఈ బంధము చాలా ప్రాచీనమైనదని చెప్పవచ్చును. ప్రాచీన లాక్షణికులు చెప్పినవానిలో ప్రధానమైనవి - చతుష్పత్ర, అష్టదళ, షోడశదళ పద్మబంధములు. కాని కొందరు ఆధునికులు, ప్రాచీన విధానములను బట్టి, ద్వాదశదళ, చతుర్దశదళ, ద్వాత్రింశద్దళ పద్మబంధములను కూడ ఏర్పరచియున్నారు.

చిత్రములలో పద్యము యొక్క గమనమును బట్టి చతుష్పత్ర, అష్టదళ బంధములలో భేదము లేర్పడినవి.

కర్ణికయందు ఒక అక్షరము నుంచి, తరువాత ఒక్కొక్క దళమునను అక్షరములను కూర్పవలెను. ఒక్కొక్క దళము తరువాత కర్ణికయందున్న అక్షరమును కలుపుచుండవలెను. ఇట్టి కూర్పున 4 దళములున్నచో చతుష్పత్ర కమలబంధమగును. 8 దళములున్నచో అష్టదళ పద్మబంధమును, 16 దళములున్నచో షోడశదళ పద్మబంధమును అగును.

సరస్వతీ కంఠాభరణమున 'చతుష్పత్ర కమలబంధము' నకు -

"సానవాత్వా సుమన సా , సానతా పీబరో రసా !
సారధా మైతి సహసా, సాహసార్ధ సువాస సా॥" -

(సరస్వతీ-చిత్ర-30)

అను శ్లోకము లక్ష్యముగ నీయబడినది (చిత్రము-13A).

శ్రీ కొక్కొండ వేంకటరత్నశర్మగారు తమ 'బిల్వేశ్వరీయము'న 'సింహావలోకన చతుర్దళ పద్మబంధ'మని ఒకటి వ్రాసియున్నారు (చిత్రము-13B).

కం॥ "శ్రీరామా జితమారా, శ్రీరామా కాలకాల శ్రీలకమాలా
శ్రీలా శ్రీలా శ్రీకర, మారాశ్రీ కరజిత కలమాలా శ్రీశ్రీ-"

(2-194)

అను ఆ పద్యము 4 దళముల మీదుగను పూర్తియైన తరువాత, దళములమీది అక్షరములు తిరిగి ఒకసారి ఆవృత్తమగును. అందువలననే నేమో దానికి 'సంహావలోకన చతుర్దళ పద్మ బంధమ'ని పేరు పెట్టియున్నారు.

అప్పకవీయములో 'అష్టదళ పద్మబంధ'మనియున్న –

"రాధాసక్తా రసగ్రా వ్రజకుల తిలకా త్రాతకృత్ర్యాయధేరా
రాధేయ త్ర్యాకృత త్రా ప్రవిమల సుగుణా గ్రావవర్యా ప్రధీరా
రాధీ ప్రర్యావవగ్రా ప్రకట దనుజ జైత్రా పదప్రోత్థధూరా
రాధూత్థప్రోద పత్రా ప్రరుచిర పృథక గ్రాసరక్తాసధారా"(4-587)

అను స్రగ్ధరావృత్త చిత్రమున 4 దళములేయున్నవి. దాని నడక కూడ చతుష్పత్ర కమలబంధము వలెనే యున్నది. కనుక దానిని అష్టదళ పద్మబంధమనుటకన్న చతుష్పత్ర కమలబంధమనుట యుక్తముగా తోచుచున్నది (చిత్రము-13C).

వేంకటాధ్వరి కృతమైన 'లక్ష్మీ సహస్రము'లోని (చిత్ర-18వ శ్లో) –

"మానతా దత్ర పరమా
మారప స్వక్షి కాలిమా
మాలికా భి స్సమేతామా
మాతామే విధుతానయా" –

అను శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు తద్వ్యాఖ్యాత శ్రీ గోపాలచార్యులవారు – "చతురర చక్రబన్ధాంకితోయం । అష్టదళ పద్మాంకిత మితిజ్ఞేయం" – అని వ్రాసి చక్రబంధ చిత్రమును, అష్టదళ పద్మబంధ చిత్రమును రెంటిని ఇచ్చియున్నారు (పుటలు-350, 351). కాని ఇది చక్రబంధ మనుటకన్న చతుష్పత్రకమలబంధమని కాని, అష్టదళ పద్మబంధ మనికాని అనుట యుక్తమనిపించుచున్నది (చిత్రము-13D,13E).

సరస్వతీ కంఠాభరణములోని 'అష్టదళ పద్మబంధ' లక్ష్యమగు –

"యాశ్రితా పావన తయా
యాతన చ్ఛిదిపీ చయా

యాచనీయా ధియా మాయా
యా మాయా సంస్తుతా శ్రియా" (సరస్వతీ-చిత్ర-27)

అను శ్లోకమునందలి గమనము చతుష్పత్ర కమలబంధమగునేమో విచారణీయము ఇచ్చిన చిత్రములో 8 దళములున్నను, ప్రతి దళము తరువాతను కర్ణికలోని అక్షరము కలియుటలేదు రెండు దళముల తరువాత ఒక్కసారి కర్ణికాక్షరముతో కలియును. మొత్తము మీద 4 దళములనే చూపుచున్నది. కనుక దానిని చుతుష్పత్ర కమల బంధమనుటయే సమంజసమనిపించుచున్నది (చిత్రము-13F).

సరస్వతీ కంఠాభరణములోని -

"నశశీశ నవేభావే నమత్కామన తీవ్రత ।
నమామి మానన మన ననుత్వాను నయం నయం॥"
(చిత్ర-29)

అను శ్లోకము 'అష్టదళ పద్మబంధమునకు, సరియైన లక్ష్యమున వచ్చును (చిత్రము-13G) ఇందు ప్రతిదళము తరువాతను కర్ణికాక్షరము కలుపబడుచున్నది

అష్టదళ పద్మ బంధమున కవి నామధేయమును కూడ పొందుపరచుట ఒక విశేషము. సరస్వతీ కంఠాభరణములోని -

"రాతావద్యాధిరాజ్యా విసరర రస విద్యాజవాక్ క్ష్మా పకారా
రాకాపక్ష్మా భశేషా నయనన నయన స్వాఖ యాస్తవ్యమారా।
రామావ్యస్తస్థిరత్వా తుహిన ననహితు శ్రీ కరక్షారధారా
రాధారక్షాస్తు మహ్యం శివ మమమవశివ్యాల విద్యావతారా॥" -
(చిత్ర -32)

అను శ్లోకమును అష్టదళ పద్మమున పొందుపరుపగా దళాగ్రముల యందు 'రాజశేఖర కమల'మను పదబంధము గోచరించును (చిత్రము-13H)

అట్లే 'లక్ష్మీ సహస్రము'లోని అష్టదళ పద్మబంధ లక్ష్యమగు -
"మాసారక్షా పరస్యా వన గగగనవత్యాఘుణత్వాశ హేమా
మాహేశ స్వాస్థ్య నాకాది పదదదపది త్యేధయిత్రీ వితామా।

మాతావిత్రీతి సూతే రచితతత చిరస్థాను కూల్యావనామా
మానావల్యా ప్రకృష్టం పరమమమరపప్రీతి రక్షారసామా॥" –
అను శ్లోకమును చిత్రబంధమున కూర్పగా దళాగ్రములందు "రఘునాథ సూనుకృతి" అనుపదబంధము గోచరించును (చిత్రము-13 I).

అష్టదళ పద్మబంధ చిత్రము లన్నింటిలోను అందమైనది (చిత్రము-13J) శ్రీవేదాంత దేశికుల 'పాదుకా సహస్రము'న నున్నది. అది –

"సాకేత త్రాణ వేలా జనిత తత నిజ ప్రాఙ్గణ శ్రీప్రభాసా
సాభ్రాప్రశ్రీ రట వ్యామియ మమ మయమివ్యాప దుచ్ఛేదిలాసా
సాలాదిచ్ఛేదతిగ్మా హవరురురువహా ప్రీకరస్యామరాసా
సారామస్యాంఘ్రి మభ్యాజతి నననతిజ స్థూలముత్రాకతేసా" –
అనునది (940 వ శ్లోకము).

మొత్తము మీద ఈ చతుష్పత్ర-అష్టదళ పద్మబంధములలో గమనింపవలసిన విషయము ఒకటి ఉన్నది. అది చతష్పత్ర కమల బంధములోని ప్రతిపాదమునను ఆద్యంతాక్షరములు సమానముగా నున్నవి. అట్లే అష్టదళ పద్మబంధములందు ఆద్యంతాక్షరములే కాక, ప్రతిపాదములలోని మధ్యాక్షరములును ప్రవేశనిర్గమ విధానమునకు అనువుగా సమమైనవి కూర్చుట కనిపించును.

ఈ పద్మబంధములో ప్రశంసనీయమైనది శ్రీ వేదాంతదేశికుల 'పాదుకా సహస్రము'న నున్నది. దానిని చతుర్దశ పద్మముగను, అష్టదళ పద్మముగను, షోడశదళ పద్మముగను కూర్చుటకు అనువుగానున్నది. అవి రెండే అక్షరములతో కూర్పబడుట గమనార్హము (పదుకా సహస్ర చిత్రములు -939 శ్లోకములు) (చిత్రము-13K).

గణపవరపు వేంకటకవి వ్రాసిన అష్టదళ పద్మబంధస్రగ్ధరా వృత్తమున విద్యున్మాలా వృత్తమొకటి గర్భితమైయున్నది. ద్వాత్రింశద్దళ పద్మ బంధమున మరొక పద్యమును గర్భితము చేయుట పరిపాటి. కాని,ఇతర పద్మబంధములందు కనిపింపవు. కాని, అష్టదళ పద్మబంధమునను గర్భిత వృత్తమును వ్రాసిన కవిశేఖరుడు ఒక్క

వేంకటకవియే కనిపించుచున్నాడు.

'పాదుకా సహస్రము'న 'పాదుకాయుగళ గర్భ కర్ణిక మష్టదళ పద్మబంధ'మని ఒకటియున్నది (949వ శ్లోకచిత్రము). అందు అష్టదళ పద్మబంధ చిత్రమున పాదుకాయుగళము కర్ణికగా కూర్చబడినది. ఇట్లు ఒక చిత్రబంధమున మరొక చిత్రమును నిబంధించుట అపూర్వము. కాని దాని గమనము క్రమబద్ధముగా లేనందున దానిని నేను స్వీకరింపలేదు.

మహామహోపాధ్యాయ శ్రీరామావతార శర్మగారు తమ 'చిత్రబంధావతారిక'లో 'ద్వాదశదళ పద్మబంధ'మను ఒక నూతన చిత్రబంధము నిచ్చియున్నారు. అందలి శ్లోకము –

"తం దేవం సతతతం భక్త్యా మహితం సౌమ్యమాయుతం ।
తం సితాంహి శితం మృత్యు రహితం చంద్ర భాసితం॥" –

అనునది. ఇందు కర్ణికయందలి అక్షరమే శ్లోకపాదములలో ఆద్యంతము లందున్నది. అది కాక ప్రతి 4 అక్షరముల తరువాతను కర్ణికాక్షరమే ఆవృత్తమగునట్లు కూర్చబడినది. ప్రతిదళము నందును రెండేసి- అక్షరముల చొప్పున కూర్చబడినవి. అందు 2 దళములుండుట వలన 'ద్వాదశదళబంధ' మని పేర్కొనబడినది (చిత్రము-13L).

శ్రీ విక్రాలశేషాచార్యులవారు తమ 'వేంకటేశ్వర చిత్ర రత్నాకరము'న (2వభాగము-100ప.) 'చతుర్దశదళ పద్మబంధ'మను నొకదానిని వ్రాసియున్నారు. ఇందు 14 దళములున్నవి. అందు-

సీ॥ "శ్రీకాంత విబుధ సంసేవ్య చక్రాబ్జాఢ్య వేంకటశైలప వంకహార వి
శేషభటా చంద్రభూషానతాంఘ్రి సంభాత చారూపల వత్రవర్య
అనఘ సత్పచిత్త యతి పతిగోత్రస స్వామి సర్వేశ్వర సమరమాధి
రత్నాకరాలయ రక్షక విశ్వాత్మ నుతికర శుభకర నతములగతి
సతతధర్మ ప్రవర్తక సారసాక్ష సర్వభువన శివంకర చరణ నళిన
వినత వినతాసుతాదిక వినుత విమల భార్గవీ వసుధానాథ భవ్యగాథ

అను సీసపద్యమున్నది. ఆ బంధపు దళాగ్రములయందు 'శ్రీవేంకటా చలపతి పరమాత్మనుతి' అనుగ్రంథస్థవిషయమును, దళములలో పై

నుండి ప్రతి 4వ అక్షరమును కలుపుచూ వరుసగా చదువగా 'విక్రాలశేషాచార్య చిత్రరత్నాకరము' అని కవి-గ్రంథ నామములును కూర్పబడియున్నవి (చిత్రము-13M).

ఈ పద్మబంధములలో షోడశదళ పద్మబంధమున లాక్షణికులను కవులను ప్రయోగించిన విధానము కడు ప్రశంసనీయమైనది.

వేంకటాధ్వరి కృత 'లక్ష్మీ సహస్రము'న ఇచ్చిన -

"క్షమా సమా గమా భీమా రామాణామా దిబా సమా।

క్షామా క్షేమా రమా నామా ప్రమాసీమా సుమా తిమా॥" - (పు.352)

అను లక్ష్యమున ప్రతి రెండవ అక్షరమును ఒక్కటే అయి, కర్ణికయందు పొందుపరుపబడినవి. మిగిలిన 16 అక్షరములును దళమున కొక్కటి చొప్పున కూర్పబడినది. అందువలన 32 అక్షరములును 17 అక్షరములలో ఇమిడిపోయినవి.

శ్రీ వేదులవారు ఇదే పద్ధతిలో మరొక ఉదాహరణమిచ్చియున్నారు. అది -

క్షమా సమాగమా రమా ప్రమా క్రమాతి మానమా

ఉమా సమాభిమానమా కుమార్గమాది మాపుమా -(పు.223) దీని పొందికను 'చిత్రము-13N'లో చూడవచ్చును. ఇది ద్విచతుష్కబంధము గను, గోమూత్రికాబంధముగను కూడ వ్రాయనగునని వారే అక్కడ వ్రాసి యున్నారు. ఇది వారి ఉపజ్ఞకు నిదర్శనము.

ఏమైనను, ఈ విధమైన చిత్రబంధ నిర్మాణమునకు ప్రమాణీవృత్తమునే గ్రహించుట గమనార్హము.

ఈ షోడశదళ పద్మబంధములలో ఉత్తమోత్తమమైనది శ్రీ వేదాంత దేశికుల 'పాదుకాసహస్రము'న నున్నది. అది కేవలము రెండే అక్షరములతో కూర్పబడినది. అందువలన కర్ణికలో ఒక అక్షరము కాగా, 16 దళములలోను ఉన్న అక్షరములును ఒకే ఒక అక్షరముతో నిర్మితమై ఆ చిత్రమునకు అందమును కూర్చినది (చిత్రము-13 'O"). అంతేకాక, ఆషోడశదళ పద్మబంధ శ్లోకమే చతుష్పత్ర - అష్టదళ పద్మబంధము లకు కూడ సరిపోవునట్లు కూర్పబడినది (పాదుకా సహస్ర చిత్రములు

-939వ శ్లోకములు) ఇట్టి ప్రజ్ఞా విశేషము నాన్యతో దర్శనీయము!

తెలుగు కవులు ఈ షోడశదళపద్మబంధమునకు అనువుగా సీస పద్యము నెన్నుకొన్నారు. అంతేకాక, అందు అష్టదళ పద్మములో వలె పేర్లనో - ఆశయములనో పొందుపరచుట లక్ష్యముగా పెట్టుకొన్నారు.

ఉదాహరణకు - "కామాక్షీ కల్యాణము"లో శ్రీరామ వీరబ్రహ్మ కవిగారు రచించిన -

"గీర్వాణి•నవవల్లకీరావ కరణి బుణ్యవధూవతంసగీతాళి పోల్చి
కర్ణాట పాటవాకర్ణ సంజనితోరు కౌతుకంబు సొనాయి గ్రాలదెలుప
సూరికవిజనాళి జోకైన మాగధ సంతతుల్ శశ్వద్యశంబునెన్న
గనదభినంద్యార్యజనుల మధురరసాంచిత సూక్తులొలక
నాశీస్సులొప్ప

రాణద్దైవాజ్ఞ మానసప్రాయులైన
యాప్తనికరోల్లసపు రీవు లలర రమ్య
గంధ మలఘుతరామోదకరము నొచు
నబ్బురంబు హృత్కంజ హృద్యంబు గాగ
నహహా! యకలంకమయిన కల్యాణమియె" -

అను సీసపద్యమును షోడశదళ పద్మబంధమున కూర్పగా, అందు "వధూవరుల కైశ్వర్య చిరాయువు లబ్బుగాక" అను పదబంధము గోచరించును (చిత్రము-13P) దీనిని ఏర్పరచుటలోని సుళువును తెలుసుకొనవలెనన్నచో, అదే చిత్రమును మొదట చతురస్రాకారమున ఎట్లు కూర్తురో ఆ గ్రంథముననే (పుట-66) చూపబడియున్నది. అది గమనార్హము (చిత్రము-13Q).

శ్రీవిక్రాల శేషాచార్యులవారు తమ 'చిత్రకందపద్య రత్నాకరము'న ఈ షోడశదళ పద్మబంధమునకు సంస్కృత కవిలాక్షణికుల విధానము ననుసరించినారు (1వభాగము-పు.71) వారు వ్రాసిన 'శ్రీశ్రీనివాస ప్రసాద మహాకావ్యము' నుండి ఉద్ధరింపబడిన

"రామ కామ సమ శ్యామ శ్రీమ స్దీమ స్దమ క్రమ!
క్షేమ నామ న్వామ భీమ భూమ ధామ న్నమ స్సమ!!" -

అను శ్లోకము (శ్రీవేంకటేశ్వర చిత్రరత్నాకరము -1భా-93 శ్లో) ఒక్క షోడశదళ పద్మబంధమునకే కాక, ద్విచతుష్క చక్రబంధ, గోమూత్రికా బంధములకు కూడ సరిపోవునట్లు కూర్చబడినది. ఈ చిత్రములకు వారి గ్రంథమున (పు.71) చూడవచ్చును.

శ్రీ శేషాచార్యులవారు తమ 'వేంకటేశ్వర చిత్ర రత్నాకరము'న ద్వాత్రింశద్దళ పద్మబంధ' మని ఒకటి వ్రాసియున్నారు. ద్వాత్రింశద్దళ పద్మబంధ లక్షణమును శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు తమ 'ప్రబంధ సంబంధ బంధ నిబంధన గ్రంథము'న చెప్పియున్నారు. 16 దళములలోను 16 చిన్న దళములను గీసి, దళములలోను కేసరాగ్రములలోను సీసపద్యమును లిఖింపగా పత్రాగ్రములందును కేసరాగ్రములందును ఉన్న అక్షరములలో వేరొక పద్యము కావలయును.

శ్రీ శేషాచార్యులవారు విరచించిన

"జయశుక వినత కాంచన గద శ్రీవాసమ్రుది మార్జనాదీడ్యమా, హరిసుఖ
రత కీశ గత నఖరాజిక్షతారి రక్షాదకంతు సృజావిపాదమాధి
అజభంగురాహిత హాసభాసాదృశాపేయ ముఖాసుఖ దాయి శాంత
తత మంగళాసారధనదనరజయదరసికాగతా తామరసనయనక
ధార్మిక హితాత్మకా శాశ్వత రమావి
లాసగ యఖర్వగుణ సశేషాసవేద్ధ
గత సుసన్ వృషగిరిపతీ భతతినుతను
దేశ సంకర్ష నియతభాతా శుభకర" - (చిత్రము-13R)

అను ద్వాత్రింశద్దళ పద్మబంధ చిత్రములోని దళాగ్రము లందలి యక్షరములను కూర్చి చదువగా -

"జగదీశ రమాసఖ సారయశా
ఖగభర్తృకవాహన కంజదృశా
నగధారణ సన్నుత నమ్రసురా
సృగుపేతనతా కవిశేషనుతా" -

అను తోటక వృత్తము వచ్చును (1వభాగము-పు.80).

శ్రీశేషాచార్యులవారి 'ద్వాత్రింశద్దళ పద్మబంధము'న కర్ణికయందు అక్షరము లేదు. వారి చతుర్దశదళ - ద్వాత్రింశద్దళ పద్మబంధములు రెండును సమానాక్షరముల పొందిక కల్గియున్నను, శాస్త్రీయముగా కనిపించుటలేదు. కాని వారి ప్రతిభ కవి నిదర్శనములనక తప్పదు.

ఇట్లు సంస్కృతాంధ్ర లాక్షణికులను కవులును ఈ పద్మబంధమున వినూత్న విధానములనవలంబించి, అనేక పద్ధతులను ప్రదర్శించి, తమ ప్రతిభను ప్రదర్శించినారనుట అతిశయోక్తికాదు!



చతుష్పత్ర కమల బంధము

[చిత్రము - 13 A].




(సింహావలోకన) చతుష్పత్రకమల బంధము

[చిత్రము - 13 B].



చతుష్పత్ర / అష్టదళ పద్మ బంధము

[చిత్రము - 13 బి].




చతుష్పత్ర / అష్టదళ పద్మబంధము

[చిత్రము - 13 E].



అష్టదళపద్మ బంధము

[చిత్రము - 13 K].



ద్వాదశదళ పద్మబంధము

[చిత్రము - 13 ఓ].



షోడశదళ పద్మబంధము

[-చిత్రము-13 P].

| | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీ | శ్రీ | శ్రా | బు | సా | ధ | సం | మ | ధు | ఊ | మా | ర | మ్య | య్యం | జ | ద్యో |
| ర్యా | స | శి | కం | నా | గ | త | ల | ర | హా | న | ర | గం | ష్ప | వ్య | మ |
| రో | థం | షా | తు | యు | మా | తుల | న | ర | ద్వై | స | ల | ధ | బు | ద్యం | రా |
| న | వ | ష్టి | కౌ | గ్ర | న | శ | జ | సాం | రా | ప్రా | ల | మ | రం | బు | ల్యా |
| మ | ఘా | క | రు | లం | క్షై | శ్వ | ర్య | చి | రా | యు | వు | ల | బ్జ | గా | క |
| వ | వ | గ్గా | ఛో | డె | ణే | ధ్య | ద్యా | త | ష్ప | ఠై | శ్రీ | ఘు | న | గ | న |
| ల్ల | త్యా | ట | ని | లు | శీ | శం | నం | సా | లా | న | పు | త | చు | న | యు |
| కో | బు | పా | జ | ప | నా | బు | భి | క్ష్మ | స్ప | యా | స | రా | నే | షా | వు |
| రా | రో | టు | సం | సా | జ | నే | ద | లా | శే | ప్త | ల్ల | మో | షు | షా | క |
| వ | ర | పా | ర్గ | తి | వి | వ్రం | న | లు | నా | ని | గా | ధ | ర | య | లం |

క

109 షోడశదళ పద్మబంధము

[చిత్రము - 13 ఎ].



ద్వాత్రింశద్దళ పద్మబంధము

[చిత్రము - 13 R]

# 14. పాదుకాబంధము

పాదుకల చిత్రమును గీసి, అందు అక్షరములను కూర్చిన పాదుకాబంధమగును. ప్రాచీన లాక్షణికులెవ్వరును దీనిని చెప్పలేదు. ఒక్క గణపవరపు వేంకటకవి మాత్రమే దీనికి తన 'ప్రబంధ రాజవేంకటేశ్వర విజయవిలాసము'న లక్ష్యము నిచ్చియున్నాడు. అది -

"రావదే ప్రోవమాధారా
రాధా మహాత్మ్య సాగరా
రాగ సాహిత్య వాజీరా
రాజీవాకార దేవరా" -(ప్రబంధరాజ -852వ పద్యము)

అనునది. దానికి చిత్రము లభింపనందున నేను ఊహించివేసితిని (చిత్రము-14).

ఈ పాదుకాబంధమున 32 అక్షరములును 19 అక్షరములలో కుదింపబడుట గమనార్హము.

శ్రీ వేదాంతదేశికులు తమ 'పాదుకా సహస్రము'న 'పాదుకాయుగళ గర్భ కర్ణిక మష్టదళపద్మ'మను నొకటి వ్రాసియున్నారు. అందు అష్టదళపద్మబంధ చిత్రముననే కర్ణికగా పాదుకాబంధము కూర్చబడినది. (శ్లోకము-949). కాని, ఆ చిత్రములోని శ్లోక గమనము క్రమబద్ధముగా తోచుటలేదు.

కావున వేంకటకవి రచనమే సమంజసముగా కనిపించుచున్నది.



పాదుకా బంధము
[చిత్రము-14].

# 15. పుష్పమాలికా బంధము

దీనికే 'మాలికాబంధ'మనియు నామాంతరమని అప్పకవీయమును బట్టి విశదమగుచున్నది.

శ్రీమండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు దీని లక్షణమును-సంధి యందు ఒక అక్షరమును, 4 దిక్కులను 4 అక్షరములను కూర్చుచు పోవలెననియు, అట్లు కూర్చిన ప్రతిపుష్పమునను 7 వర్ణములగు ననియు, స్రగ్ధర కాని చంపకమాల కాని దానికి అనువైన వనియు - చెప్పి యున్నారు.

అప్పకవి రెండు రకముల మాలికాబంధముల నిచ్చియున్నాడు. ఒకటి -

"అనంత నందనందనా
సనాతనా జనార్దనా
వనాట రత్న రక్ష రమ్య
నాగనాథ నాశనా" - (అప్ప. 4-589) -

అను ప్రమాణి వృత్తమునను,

రెండవది - "ఖరహార ధీరదేవ కనక ప్రకటాంబర వీరసారదు
ర్ధర ధరవార వేణురవ రమ్య రమేశ మహామహామహీ
ధరగరహారసన్నుత కృతజ్ఞత శిష్ట పరాపరా పరం
శరణ రజోరమా విశద శస్త శమాత్మక శ్రీకళాకరా" --
(అప్ప. 4-590)

అను చంపకమాలయందును గలవు. ప్రమాణివృత్త చిత్రబంధమున 5 పుష్పములును (చిత్రము-15A), చంపకమాలావృత్త చిత్రబంధమున 12 పుష్పములును (చిత్రము-15B) గలవు.

పుష్ప మాలికా బంధమును చిత్రించుటలోని సౌలభ్యమును తెలియుటకు శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యకవిగారు తమ 'ఆంధ్ర మహాభ్యు దయము'న ఇచ్చిన చిత్రమును గమనించినచో స్పష్టమగును (చిత్రము-15C). ఆపుష్పమాలికచే అలంకృతమైన పద్ధతిని కూడ తరువాతి

చిత్రమున (15 D) చూడవచ్చును.

పిండిప్రోలు లక్ష్మణకవి 'లంకావిజయము'న స్రగ్ధరావృత్తము నుపయోగించియున్నాడు (2-228). కాని ముద్రిత ప్రతియందు (వావిళ్లవారు-1927) అది 'స్రగ్ధరా పుష్పగుచ్ఛబంధ'మని యున్నది. అది పొరపాటు. 'స్రగ్ధరా పుష్పమాలికాబంధ'మని యుండనగును.

గణపవరపు వేంకటకవి ఈ పుష్పమాలికాబంధమునకు లక్ష్యముగా—

"శ్రీరామే రానురాగ స్థిరతర మురళీ స్మేరసారస్వరశ్రీ
తారా దారా ధరా స్యాదర భరహరణా దానితా నిత్యనిష్ఠా
తారా పారాబ్జరావాదరభరణరతా ద్రౌపదీపస్వపక్షా
సారాచారాభిరామా శరవరశరణా చారు కారుణ్యరుచ్యా"
(ప్రబంధరాజ.- 863 ప.)

అను స్రగ్ధరావృత్తమును ఇచ్చియున్నాడు. అందు -

"శ్రీ రామే రారాగా
తారా దారా ధరస్య దరభరహరణా
దారా పారా రావా
సారా చారాభి రామ శరవర శరణా" -

అను కందమును,

"స్థిర తర మురళీ
దరభర హరణా
దర భరణరతా
శరవరశరణా" -

అను మదన విలసిత వృత్తమును,

"స్థిర తర మురళీ స్మేర సారస్వరశ్రీ
దరభరహరణా దానితానిత్య నిష్ఠా
దరభరణ రతా ద్రౌపదీప స్వపక్షా
శరవర శరణా చారుకారుణ్యరుచ్యా"

అను శ్లోకమును, గర్భితములైయున్నవి.

చింతలపల్లి ఛాయాపతి తన 'రాఘవాభ్యుదయము'న -

"సురవర చిరనుతనతరత
దరకరవర విమల మహిమ దరవర వరమే
శ్వర పురహర హితకృతమత
దరతర వరహసన సరస ధరధరవరదా!" (3-294)-

అను కందపద్యమును లక్ష్యముగా ఇచ్చియున్నాడు. ఇందు 9 పుష్పము లుండట గమనింపదగినది. కందపద్యము మాత్రాగణబద్ధమైనది కనుక, అక్షరముల కూర్పులో కలుగు వెసులుబాటువలన పుష్ప సంఖ్య మారుటకు అవకాశమున్నది. అందువలన ఇందు 9 పుష్పములేర్పడినవి.

ఈ పుష్పమాలికాబంధ నిర్మాణమున గమనింపవలసిన అంశము మరొకటి ఉన్నది. పుష్పపు కర్ణికయందు కూర్పవలసిన అక్షరము, ఆ పుష్పపు దళములలోని ప్రతి అక్షరము తరువాతను కలుపుకొనుటకు అనువుగా కూర్పవలెను. ఇది అన్ని పుష్పబంధములలోను నియతముగా పాటింపబడును.

కవులందరును దేవతాప్రార్థనలలో ఈ పుష్పబంధమును ఉపయోగించి ఔచిత్యమును పాటించినారు.



అనంత నందనందనా సనాతనా జనార్దనా
వనాటరత్నరక్షరమ్యనాగనాథనాశనా.

పుష్పమాలికా బంధము - [చిత్రము - 15 A].



చ. ఖరహర ధీర దేవ కనకప్రకటాంబర వీరసారద
ర్ధరధరవార వేణురవరమ్య రమేశ మహామహామహీ
ధర గరహారసన్నుత కృతజ్ఞ శిష్టపరాపరాపరం
శరణ రజోరమావిశదశస్తశమాత్మక శ్రీకళాకరా.

[పుష్పమాలికా బంధము - చిత్రము - 15 8].

## పుష్పమాలికా బంధము—ఈశ్వర ప్రార్థన

చ. నరవరధీరమా వనజ – నర్తన ధీర ధరాధరాధరా
స్థిరతరసారవీర శివ –. శిష్ట శిఖాబ్జకళాంక శంకరా
హారహర ఘోరఖారహర – హర్షహశాన్నట, ఝూఠటాటని
ర్షురకరధార శక్తిదన – జన్మ జయప్రదమోద సోదరా.

[–చిత్రము – ౧౯ ౮].



## పుష్పమాలికా బంధము:—కుమారస్వామి ప్రార్థన

చ. వరశరజా రమాధవ భ – వ స్తవనీయ కళాకథాకరా
సురనరవారవంద్య శుచి – శుభ్ర శుభంకరధీరశూర సా
దర వరదా రసజ్ఞ తను – త త్త్రాత మోభరః ఘోరతారకా
సురహార వీర గౌరిసుత – సుత్యసుధీధనదానమానసా.

[చిత్రము – 15 D]

# 16. మురజ బంధము

మురజబంధమునకే 'మర్దలబంధ'మనియు నామాంతరము.

మురజ చిత్రమును గీసి, దానిపైన 'చిత్రము-15 A/B/C లలో వలె పద్యమును పొందుపరుపగా, అదే పద్యము మూడుసార్లు ఆవృతమగుట మురజబంధము.

'సరస్వతీ కంఠాభరణము'లోని చిత్ర ప్రకరణమున (48 శ్లో) ఇచ్చిన –

"సాసేనా గమనారంభే
రసే నాసీదనారతా
తారానాద జనామత్త
ధీర నాగ మనామయా" –

అను శ్లోకమును అడ్డముగ ఉన్నది ఉన్నట్లు చదివిన ఒక శ్లోకమగును. గీతలలోని అక్షరములను కూర్పగా, అదే శ్లోకము రెండుసార్లు ఆవృత్తమగును (చిత్రము-15 A).

అప్పకవి దీనిని 'మర్దలబంధ'మని వ్యవహరించి, దానికి లక్ష్యముగా –

"రాజులు రాజశయానా
లాజలు చల్లిన యానన్
పూజలుగా వశవర్తిన్
రాజిలు రాజనవయ్యా" – (అప్పకవీయము. 4-578)

అను చిత్రపద వృత్తమును ఇచ్చియున్నాడు (చిత్రము-16 B).

వేంకటాధ్వరి కృత 'లక్ష్మీ సహస్రము'న – (పు.355) –

"ఇన్దిరా భాసురా పద్మ
మన్దిరా పథరాపహా
హాపరాధ హరాదృష్ట్యా
సాపరా భాసురాదృతా" –

అనునది లక్ష్యముగా చూపబడినది. పై రెంటికన్న కొంచెము భిన్నముగా

నున్న ఆ చిత్రబంధమును 'చిత్రము-16C'లో చూడవచ్చును.

ఈ మూడింటి నిర్మాణము వేరువేరుగా నున్నను, విధానము మాత్రము ఒక్కటే!

అప్పకవి ఇచ్చిన లక్ష్యమున గమనింపవలసిన అంశము ఒకటి ఉన్నది. పద్యమును గీతలలో చదివినప్పుడు అక్షరములలో ఇంచుక మార్పు కనిపించుచున్నది (4-578) అయితే, చిత్రకవితలో, అనులోమ విలోమ గతులలో కొంచెము వ్యత్యాసము వచ్చినను పట్టింపు లేకుండుట గమనార్హము !

'సరస్వతీ కంఠాభరణము'న 'మురజబంధము (ఏకాక్షర)' అనునది ఒకటి గలదు. దాని లక్ష్యము

"సురాననత్వాం ననహాన నష్టయే
పునస్తువేఽనర్ఘ ఘనప్లవాననమ్ ।
మనస్యనూన ప్రధన ప్రధూననం
సకాననస్థాన నదీన నర్దనమ్--" - (సరస్వతీ-చిత్ర-49)

అను శ్లోకము. దీని చిత్రబంధ నిర్మాణ క్రమము సాధారణ మురజ బంధము వలెనే ఉన్నది. కాని, మురజాంతర్భాగమున ఒకే ఒక అక్షరము తిరుగునట్లు కూర్పబడినది (చిత్రము-16D). కావున దీనిని 'ఏకాక్షర' అని యుండవచ్చును.

గణపవరపు వేంకటకవి ఈ మురజబంధమునకు లక్ష్యముగా విద్యున్మాలావృత్తము నిచ్చియున్నాడు.

"వీరోదారా వేదారాధా
నారోదారా నాదారాగా
గారోదానా కాదాధారా
వీరోదారా వేదాధామా" - (ప్రబంధరాజ-857) -

అను ఆ లక్ష్యమున అన్ని దీర్ఘాక్షరములే అగుట విశేషము !

'సరస్వతీ కంఠాభరణము'లో 'మురజప్రస్తారబంధ'మని ఒకటి ఉన్నది (చిత్రము-16E). అది కూడ మురజబంధమువలెనే ఉన్నను, ఇంచుక భేదమున్నది. మురజబంధములో వలెకాక, ఇందు గీతలలోని

అక్షరములు చదువగా వేరొక శ్లోకము వచ్చును. అనగా–

"తాలసార ప్రభారాకా
తారకాపతి దంసితా!
మారధామా రమాధీత
బలయామాస సాగరమ్" - (సరస్వతీ-చిత్ర-50) -

అను ఆ మురజప్రస్తార శ్లోకమును చిత్రబంధమున లిఖించి, గీతలలోని అక్షరక్రమమును చదువగా -

"వర కారో పదం ధీరం
తార ధామాఽసమాస్రికా
సాలతా మలయా మాప
తారాభాతి రసాగతా" -

అను వేరొక శ్లోకము వచ్చును.

ఇట్లే మురజబంధమున 2,3 రకములు కనిపించుచున్నను నిర్మాణక్రమములో మాత్రము ఒక్కటేయగుట గమనింపదగియున్నది.



మురజ ప్రస్తార బంధము

[చిత్రము - 16 E].

# 17. రథ బంధము

రథము వలె చిత్రమును గీసి, అందు కంద పద్యమునో సీస పద్యమునో కూర్చుట రథబంధమగును.

రథబంధమునకును గవాక్ష బంధమునకును దగ్గరి సంబంధము కలదు. చక్ర–కేతనములలో తప్ప ఆ రెంటికీ భేదములేదు. కందపద్యమునకు బదులు సీసపద్యమును కూర్చినచో గదుల సంఖ్య పెరుగునే కాని పద్ధతిలో మార్పురాదు. గవాక్ష విధానమునకు చక్ర ధ్వజముల కూర్పువలన రథాకారము కలుగుచున్నది. మధ్యనున్న నిలువు గదులలో మాత్రము కవి ఆశయము ఉండును.

గణపవరపు వేంకటకవి కృత 'ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాసము'న (854వ పద్యము) ఒక రథబంధ కందము కలదు. కాని ఇందలి మధ్యాక్షరములను నిలువుగా చదివినప్పుడు రావలసిన పదబంధము వచ్చుటలేదు. కనుక నేటి ముద్రిత ప్రతిలో (ఆం.ప్ర.సాహిత్య అకాడమీ-1977) ఏదో దోషములు దొర్లినట్లు అనిపించుచున్నది.

శ్రీనాదెళ్ల పురుషోత్తమ కవిగారు వ్రాసిన 'చిత్రకందపద్య రత్నాకరము'న గల –

"శ్రీ దాసోదారామే
మేదం బద్ధట్టు విశ్వమెల్ల నెఱుంగు
న్నాదరమంగ హరిభక్తులు
నీ దోహల మందవేడ్కనె త్రిదిలెక్కా" – (పు.4) –

అను కందమును రథబంధచిత్రమున కూర్పగా నడిమి గదులలో "శ్రీ సోమేశ్వర నీవే దిక్కా" అను పదబంధము గోచరించును (చిత్రము-17 A)

శ్రీ పురుషోత్తకవిగారు తమ 'అద్భుతోత్తర రామాయణము' నను ఒక రథబంధకందమును వ్రాసి యున్నారు (7-154). దానిని చిత్రబంధమున కూర్చి చదువగా మధ్యనున్న నిలువుగదులలో ఆ కందపద్య తృతీయపాదమే వచ్చును. అందువలన కవిగారు దానిని "తృతీయ పాద

గోపన రథబంధకంద' మని చెప్పియున్నారు.

శ్రీ కొక్కండ వేంకటరత్నం పంతులుగారి 'బిల్వేశ్వరీయము'న (1-244) రథబంధమునకు కందమునకు బదులు తేటగీతి ఉపయుక్తమైనది. అందలి నడిమిభాగమున "శ్రీనృసింహా మమ్మేలు మేలు" అను పదబంధము గోచరించును. ఆ తేటగీతి చతుర్థపాదము కూడ 'శ్రీనృసింహా మమ్మేలుమేలు' అనియే అగుట ఇందలి విశేషము. అందువలననే దానిని పంతులుగారు 'తురీయ పాదోద్ధార రథబంధ'మని వ్యవహరించినారు.

రథబంధమున సీస పద్యమును స్వీకరించినప్పుడు చక్రములను వదలి కేవలము ఇరుసున గల దండము వరకు మాత్రమే అక్షరములను కూర్చుట ఒక పద్ధతి. గోపీనాథకవి కృత 'శిశుపాలవధమహాకావ్యము'న గల-

"శ్రీకరా సురరాజసేవిత పాదగోపీలోల బుధజనపాల శుభద
గురుతర సలలిత గుణ ఘనాఘన గాత్ర ప్రకృతి రంజన చిత్త
రామణీయ
హరికృష్ణ పాపాపహాదిగింద్రావన భోగీశ్వరశయాన పుణ్యశీల
చక్రభావిత సుహస్త రుచేందు బింబాస్య వేదజ్ఞ చిన్మయ విష్టపేంద్ర
మానితాచార గుణానిధి మాన మహిత
హారశారద ఘన హీరసారకీర్తి
దీనరక్షా విమల నామ దివ్యగుణక
దంబ రక్షింపు నన్ను కోదండరామ! - (పు.318) -

అను రథబంధసీసమును చిత్రమున కూర్పగా "శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్ర మహీరమణ కోదండరామ" అను పదబంధము గోచరించును (చిత్రము-17 B).

ఇరుసున గల దండముననే కాక, ఇరుసునకు ఇటునటు ఉండు చక్రములందును అక్షరములను కూర్చుట మరొక పద్ధతి. 'కామాక్షీ కల్యాణము'న (పుట-69) శ్రీశేషాద్రి రమణకవులు రచించిన "నామ గోపక చమత్కార మహారథబంధ'మగు -

"శ్రీప్రకాశక రమాసీమన్తినీవక్ష మంజుల శుభనామ మానసీయ
జగదేకపూజ్య శంకర పద్మనాభ సద్భర్మాంబరా భుగ్న వైరియవస
శ్రీశలోకారాధ్య క్షిప్రభక్తావన శౌరి శ్రీకర మహాశౌర్యసార
కోటిమన్మథ రూప గోపాలదర్శన భవ్యనిస్తుల శాన్త వంద్యమాన
స్తుతిపదా ధూతదుష్కృత సువరకీర్తి
రజ్గయోగీన్ద్ర పోష శ్రీరామచంద్ర
సర్వగీర్వాణ భోగముల్ జయము నయము
ఆయురారోగ్య భద్రమ్ములలరవలయు" -

అను సీసపద్యమున ఇరుసునందును చక్రములందును కూడ అక్షరములు కూర్పబడినవి ఇందలి నడిమి గడులలో "శ్రీకామాక్షమా శంభుప్రసాద వధూవరయోశ్రీ" అను పదబంధము గోచరించును. అంతేకాక, 4వ నిలువువరుసలో 'శుభమస్తు' అనియు, 12వ నిలువు వరుసలో 'జయమస్తు' అనియు కూర్పబడినది. చిత్ర బంధమునకు 4 దిక్కులందును మంగళప్రదమగు 'శ్రీ'కారములు కూర్పబడినవి అందుకే దానిని వారు'చమత్కార మహారథబంధ'మని యుండవచ్చును (చిత్రము-17 C).

రథబంధము యొక్క మరొక ఆకారము 'కామాక్షీ కల్యాణము' ననే ఉన్నది. శ్రీమిన్నికంటి గురునాథ కవిగారు రచించిన ఆ రథబంధ సీసములో (పు.70) ఇరుసున అక్షరములు లేవు. రెండు అక్షరములు మాత్రము చక్రములందున్నవి.

రథబంధము యొక్క మనోహరమైన ఆకారమును శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యకవిగారి 'ఆంధ్ర మహాభ్యుదయము'న (చిత్రము-17 D) చూడవచ్చును. శ్రీ సుబ్రహ్మణ్యకవిగారు మాత్రాగణ బద్ధములైన పద్యము కాక శార్దూల విక్రీడితమును గ్రహించుట ఇందలి విశేషము. ఇందు మధ్యలో నిలువున 'విశ్వేశా-వరద' అని కూర్పబడినవి.

మొత్తము మీద ఈ రథబంధమునకు మాత్రాగణబద్ధములైన సీస-గీత-కందములేకాక, శార్దూలాది వృత్తములును ఉపయోగించుటకు వీలుండట గమనార్హము!



రథ బంధము – 2

[చిత్రము – 178].



రథబంధము-౩

[చిత్రము-౧౭౮].




## రథ బంధము—ఈశ్వర ప్రార్థన

శా. విశ్వజ్ఞా సదయా నిరంతరరసా - విఖ్యాతతేజోనిధీ
విశ్వేహోప్రద సాధురక్షణభృశా — విగ్రైకచిత్తా శివా
విశ్వాసావగతస్వరూప కరుణా — వీరత్వభూషా భవా
శశ్వద్దర్శనమీయరా సుఖదభా — శాంతాధినేతా హరా.

(తెలుఁగుననిది నూతన బంధము - మధ్యగదిలో నిలువుగఁ జూచిన
విశ్వేశా వరద - అనియున్నది)

[చిత్రము - 17 D].

# 18. వ్యోమ బంధము

వ్యోమమనగా ఆకాశము. ఆకాశమువలె గోళాకార చిత్రమును గీసి, అందు 18 శిఖరముల నుంచి, గోమూత్రికాబంధ విధానమున శ్లోకమును కూర్చగా, దాని ఆద్యంతములు కలిసి గోళాకారమున నుండుట వ్యోమబంధము.

సరస్వతీ కంఠాభరణమున -

"కమలావళి హారి వికాస విశేషవహం జనకాంక
ననగామి కరం దివసా రమనారమణం జరతాంన।
తమసాం బలహాని విలాసవశేన వరం జనకాంత
ననమామి చిరం సవితా రమనాది మహం జగతాంన॥"

(చిత్ర-47)

అను లక్ష్యమున్నది (చిత్రము-18). దీనికి వేరొక ఉదాహరణము మృగ్యము.



వ్యోమ బంధము

[చిత్రము–14].

# 19. శరబంధము

బాణము వలె చిత్రమును గీసి, అందులో ఆద్యంతములందు కొన్ని అక్షరములను, మధ్యలో కొన్ని అక్షరములను 'చిత్రము-20'లో చూపినట్లు కూర్చిన శరబంధమగును.

వేంకటాధ్వరి కృత 'లక్ష్మీ సహస్రము'న (పు.354) ఒక్క లక్ష్యము దీనికి గలదు. దానికి అనువాదప్రాయమైన శ్రీ వేదులవారి 'లక్ష్మీసహస్ర కావ్యము'న దాని ఆంధ్రీకరణము గలదు. అది-

"సముద్రజోన్నతామహా
క్షమాసుధీప్రతారికా
సముద్రజోన్వితారిహా
కుమార్గధీప్రతారికా" (పు.225)-

అను ప్రమాణివృత్తమున గలదు (చిత్రము-19).

శ్రీ వేదాంతదేశికుల 'పాదుకా సహస్రము'నను దీనికి మరొక లక్ష్యము కలదు (923 శ్లో).

శ్రీ వేల్పుగొండ లక్ష్మీనృసింహ క్షేత్రమహాత్మ్యము(2-137) నను ఒక శరబంధమున్నది. కాని దాని గమనము సరిగా లేదు. ఆచార్యులవారు దానిని 'మార్గణబంధ'మని వ్యవహరించినారు.

# 20. శరయంత్ర బంధము

శరయంత్రబంధమున శ్లోకమును 4 పాదములలో (చతురంగబంధములోవలె) కూర్పగా, అందలి మొదటి అక్షరమునుండి గుఱ్ఱపుదాటులలో ఒక్కొక్క పాదము చొప్పున పూర్తి అయి, తిరిగి అదే శ్లోకము క్రమముగా వచ్చును.

దీనికి 'సరస్వతీ కంఠాభరణము'న -

"నమస్తే జగతాం గాత్ర
సదానవ కులక్షయ
నమస్తేఽజసతాం నాత్ర
ముదామవన లక్షయ" - (చిత్ర-45) -

అనునది దీనికి లక్ష్యముగా ఈయబడినది (చిత్రము-20).

పండిత రామరూపపాఠక్‌గారు కూడ దీనికి తమ 'చిత్రకావ్య కౌతుకము'న (పు.98) ఒక లక్ష్యము నిచ్చియున్నారు.

దీనికిని చతురంగ బంధమునకును దగ్గరి సంబంధము కనిపించుచున్నది.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| న | మ | స్తే | జ | గ | తాం | గా | త్ర |
| స | దా | న | వ | కు | ల | క్ష | య |
| న | మ | స్తే | జ | ఒస | తాం | నా | త్ర |
| ము | దా | ము | వ | న | ల | క్ష | య |

శరయంత్ర బంధము

[చిత్రము-౨౦].

# 21. శైల బంధము

శైల బంధము గోపురబంధము వంటిదే. గోపురబంధములో వలెనే సూచ్యాకారముగా 49 గడులు వచ్చునట్లు చిత్రమునుగీసి, అందు అక్షరములను కూర్పగా, నడిమి నిలువు గడులలో ఒక విశిష్ట పదబంధము గోచరించును.

కణాదము పెద్దన సోమయాజి కృత 'ముకుంద విలాసము'లోని –

"శ్రీశా గరుడాంచద్వా
హా శివసఖ లలితశీలి యాదృత కేళీ
దాశరథి కనకరశన ద
యాశరధి శ్రితాంబుజ భవ యంచితవిభవా!"– (చిత్రము–21) అను శైలబంధకంద లక్ష్యమున "గద్వాల కేశవ" అను పదబంధమున్నది.

'సుబ్రహ్మణ్య విజయ'మను గ్రంథమున కూడ శైలబంధము కందముననే ఉన్నట్లు ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసములో ఉన్నది (పు.34).

# 22. సర్వతోభద్ర బంధము

చతురంగముతె చిత్రమును గీసి, అందు మొదటి 4 వరుసలలో ఒక శ్లోకమునువ్రాసి, దానినే తిరిగి 4,3,2,1 పాదముల క్రమమున మిగిలిన 4 వరుసలలో వ్రాయవలెను. అట్లు వ్రాసిన దానిని, ఏ మూల నుంచి చదివినను అదే శ్లోకము ఆవృత్తమగునట్లు కూర్పవలెను. సర్వతో భ్రమణ లక్షణముండుటవలన దీనికి సర్వతోభద్ర బంధమని సరస్వతీ కంఠాభరణ (చిత్ర -42 వ్యాఖ్య), కావ్యాదర్శములందు చెప్ప బడినది.

సర్వతోభద్రబంధశ్లోకమున ప్రతిపాదమును పాదభ్రమకమై యుండును. ఉదాహరణకు -

1. "రసా సార రసా సార
సాయతాక్ష క్షతాయసా
సాతావాత తవా తాసా
రక్షతస్వ స్వతక్షర " - (కావ్యప్రకాశం - పు.533) -

2. "దేవకానిని కావాదే
వాహికా స్వస్వకాహివా
కాకా రే భభరే కాకా
నిస్వభవ్యవ్యభస్వని" - (సరస్వతీ - చిత్ర - 42) -

అప్పకవీయమున గల -

"వందే సదా దాస దేవం
దేవరం పపరంవదే
సరంగకం కంగరంస
దాపకం తతకం పదా" (4-538) -

అను లక్ష్యనిర్మాణమును 'చిత్రము-22A'లో చూడవచ్చును.

చతురంగ బంధమువలె ఈ సర్వతోభద్రమునకు అక్షర సంఖ్య నియమితమైనది కనుక, అనుష్టుప్ వంటి సంఖ్యా నియమముగల శ్లోకమునే వాడుట సంప్రదాయము. అప్పకవి కూడ ఈ సర్వతో భద్రమునకు లక్ష్యమును సంస్కృత శ్లోకమునే ఇచ్చియుండుట గమ

నార్థము. కాని, శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మగారు తమ 'లక్ష్మీ సహస్రకావ్యము'న -

"రామా రామా మారా మారా
మామా మామా మామా మామా
రామా కారా రాకా మారా
మామా రాజే జేరా మామా" - (పుట. 230) -

అను విద్యున్మాలావృత్తమును లక్ష్యముగా ఇచ్చినారు (చిత్రము-22B). అందులో అన్నియు దీర్ఘాక్షరములే ఉండుట గమనార్థము !

శ్రీ వేదాంత దేశికుల 'పాదుకా సహస్రము'న గల -

"పాపాదపాపాదపాపా
పాద పాద దపా దపా
దపా దపా పాద పాద
పాద పాద దపా దపా" - (933వ శ్లోకము) -

అను లక్ష్యము రెండే అక్షరములతో కూర్పబడినది.

మొత్తము మీద, 4 దిక్కులనుండియు చదువుటకు అనువుగా ఎంతో నేర్పుతో కూర్చిన ఈ సర్వతోభద్ర బంధము చిత్రకవితలోనే ఒక ఆశ్చర్యజనకమైన ప్రయోగమని చెప్పుట అతిశయోక్తికాదు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వం | దే | స | దా | దా | స | దే | వం |
| దే | వ | రం | ప | ప | రం | వ | దే |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| దా | ప | కం | త | త | కం | ప | దా |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దే | వ | రం | ప | ప | రం | వ | దే |
| వం | దే | స | దా | దా | స | దే | వం |

సర్వతోభద్ర బంధము -1
[చిత్రము - ౨౨ A].

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| రా | మా | రా | మా | మా | రా | మా | రా |
| మా | మా | మా | మా | మా | మా | మా | మా |
| రా | మా | కా | రా | రా | కా | మా | రా |
| మా | మా | రా | జే | జే | రా | మా | మా |
| మా | మా | రా | జే | జే | రా | మా | మా |
| రా | మా | కా | రా | రా | కా | మా | రా |
| మా | మా | మా | మా | మా | మా | మా | మా |
| రా | మా | రా | మా | మా | రా | మా | రా |

సర్వతోభద్ర బంధము - ౨

[చిత్రము - ౨౨౮]

# 23. క్షురికాబంధము

క్షురిక కూడ ఒక చిత్ర బంధమగుట విశేషము.

అప్పకవీయమున మాత్రమే ఈ బంధము చెప్పబడియున్నది.

ఖడ్గ బంధములో వలెనే పిడియందు కొన్ని అక్షరములను, కత్తి వాదరయందు కొన్ని అక్షరములను కూర్పవలెను. వాదరపైన ఒకే ఒక వరుస యుండును. అది అనులోమ విలోమ గతిలో చదువుటకు అనువుగా కూర్పబడును. అది క్షురికా బంధము.

అప్పకవి వీనికి లక్ష్యముగా –

"చేసితౌ సిరిసిల్గుచే
వాసివాదరి చేరిరా
రాసుతాదిని బోసిగా
గాసిబోనిది తాసురా" (అప్ప. 4-591) –

అను సరోజవృత్తమును ఇచ్చియున్నాడు (చిత్రము -23).

దీనికి ఇతర లక్ష్యములు మృగ్యము!



క్షురికా బంధము

[చిత్రము - ౩౩].

## ఇతర చిత్ర బంధములు

చిత్ర కవితయందు అసామాన్య ప్రజ్ఞావిశేషములను ప్రదర్శించిన గణపవరపు వేంకటకవి తన 'ప్రబంధరాజవేంకటేశ్వర విజయ విలాసము'న కొన్ని ఇతర చిత్రబంధములను లక్ష్యములను ఇచ్చి యున్నాడు. వానికి చిత్రము లెచ్చుటను లిఖింపనందున, ఇచ్చట వానిని యధాతథముగా ఉద్ధరించుచున్నాను. -

1. ఆందోళికా బంధము -

"మారా మాసాదయ భర
భార శరాసా జలజ సువదన నిజరసా
సార జనిన దవసు జలజ
సారశరా భార భయద సామా రామా"

(ప్రబంధరాజ - పు.261) -

అను అందోళికా బంధ లక్ష్యమును చిత్రమున కూర్చగా, అది సరిగా నడుచుట లేదు. కావున నేటి ముద్రితప్రతిలోఏవో దోషములు దొర్లినట్లు అనిపించుచున్నది (ఆం.ప్ర.సాహిత్య అకాడమీ-1977).

కాని, ఇందలి కందము అనులోమ విలోమ గతులలో చదువుటకు అనుకూలముగానున్నది. అందువలననే వేంకట కవి దానిని 'ఆందోళికా బంధయుక్తానులోమ విలోమ కంద'మని వ్యవహరించియున్నాడు.

2. శంఖ బంధము -

"మరకత మణిమయ మహిమత
కరమలరుతనుకళ కలిమి కలికి సతమ్మో
యురమున భుజగవరధరా
ధరము నమరు హరి మదన దమన నుతపదా" -

(ప్రబంధరాజ - ప. 853)

అను శంఖబంధ లక్ష్య నిర్మాణ విధానమును కూడ ఆలోచింపవలసి యున్నది.

ఇదికాక, 808 పద్యమగు "సారాగ్ర్య సారస సమనేత్ర

యుగళ...." అను సీస పద్యమునను ఒక శంఖబంధమున్నట్లు గణపవరపు వేంకటకవి చెప్పియున్నాడు. కవిగాని, పరిష్కర్తలుగాని కనీసము దాని ఉద్ధార పద్యమైనను చెప్పియుండలేదు.

3. హల బంధము -

"శ్రీనకనక నయన ధన
జ్ఞానకనద్యానసాన సనకనదీనా
ధాన జనన నగనటన
స్థానజన స్థానహీన జనఘనహననా" -

(ప్రబంధరాజ-851)

అను హలబంధ లక్ష్యచిత్రమును కూడ ఊహింపవలసియున్నది.

ఇవికాక 808వ పద్యమగు "సారాగ్ర్యసారససమనేత్రయుగళ ...." అను ఆ సీసపద్యమున శకట-వీణాబంధములును ఉన్నవట. ఆ బంధోద్ధార పద్యములను, వాని చిత్రములను ఊహింపవలసియున్నది.

# నవీన చిత్రబంధములు

ఆధునిక కాలమున కొందరు కవులు సంప్రదాయబద్ధమైన ప్రాచీన చిత్రబంధములలోని మెళకువలను ఆకళింపు చేసికొని, స్వోపజ్ఞకము లైన కొన్ని నూతన చిత్రబంధములను కల్పించియున్నారు. శ్రీమండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు, నాదెళ్ల పురుషోత్తమ కవిగారు, 'చిత్రకవి' పండిత రామరూపపారక్‌గారు, మహామహోపాధ్యాయ శ్రీరామావతార శర్మగారు, రావు కొండలరాయడు వంటి ప్రజ్ఞావంతుల నెందరినో ఈ సందర్భమున పేర్కొనవచ్చును. పార్వతీశ్వరశాస్త్రిగారు, పురుషోత్తమకవివంటివారు వాటికి లక్షణములను కూడ వ్రాసియున్నారు వానిలో కొన్నింటికి, చిత్ర కవితకు ఉండవలసిన సంక్షిప్తత, క్రమాక్షర విన్యాసము వంటి ప్రధాన లక్షణములున్నవి. మరికొన్ని క్రమబద్ధత లేక చిత్రములలో ఎట్లో ఒకట్లు పద్యములను కూర్చుటయే ప్రధానధ్యేయముగా కనిపించుచున్నది.

శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు తమ 'ప్రబంధ సంబంధ బంధనిబంధన గ్రంధము'న సంప్రదాయబద్ధమైన పై బంధములతోపాటు డమరబంధము - పరశుబంధము - తూణీర బంధము - ఉలూఖలబంధము - ముసలబంధము - పతాక బంధము - దర్పణ బంధము - నాగాభరణబంధము - వీణాబంధము - గదాబంధము - శకటబంధము - ఆందోళికా బంధము - మత్స్య బంధము - కైలాస మహాద్రిబంధము - వంటి ఎన్నో నూతన బంధములను, వాని లక్షణములను చెప్పినారు.

అట్లే చిత్రకవి పండిత రామరూపాఠక్‌గారును తమ చిత్రకావ్య కౌతుకము'న శ్రీ బంధము, తిలక బంధము, ముసల బంధము, సరోబంధము, కూప బంధము, ప్రేమలతా బంధము, సూర్యబంధము, చంద్రబంధము, దర్పణబంధము, మేరు బంధము, గజబంధము వంటి అనేక నూతనబంధములను తెల్పియున్నారు.

వీనిలో కొన్ని మాత్రమే చిత్రకవితలో సామాన్యముగా పాటింపబడెడి క్రమాక్షర విన్యాసమును పొందియున్నవి. అట్టివానిలో కొన్నింటిని మాత్రమే

ఇచ్చట వివరించుచున్నాను.

1. అశోక స్తూప బంధము -

అశోక స్తూప చిత్రమున పద్యమును కూర్చుట 'అశోక స్తూప బంధము'. ఇది ఎవరు వ్రాసిరో తెలియదు. దీని లక్ష్యమున -

"పరతర సురవర హార భా
స్కరనుత శ్రీమాన్య తరుణ కరివర వరదా
ధర ధర ధరణీ రక్షా
పరనరతర నంబులాద్రివాసనృసింహా" -

అను కందపద్యమున్నది. దాని చిత్రవిన్యాసమును 'చిత్రము-I'లో చూడవచ్చును.

2. చామర బంధము -

వింజామరమును గీసి, అందు 6 వరుసలలో అక్షరములను కూర్చిన చామరబంధమగును. చామరపు దండమునను, కొనయందును కూర్పు అక్షరములను అనులోమ విలోమగమనమునకు అనుకూలముగా నుండునట్లు కూర్పవలెను అని దీని లక్షణమును శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు తమ 'ప్రబంధ సంబంధ బంధ నిబంధన గ్రంథము'న (పు.2) చెప్పియున్నారు.

'శ్రీ వేల్పుగొండ లక్ష్మీనృసింహ క్షేత్రమహాత్మ్యము'న శ్రీ లక్ష్మీ నృసింహాచార్యులవారు దీనికి ఇచ్చిన -

"ధీరవ విమల పదాబ్జా
భార శ్రీ రత్నగర్భ పరపాశార
శ్రీ రక్ష దేవ పరస్ర
గ్వారశ్రీ రమ్యవక్ష పలమవివరధీ" - (2-132) -

అను పద్యము దీనికి సరియైన లక్ష్యముగా కనబడుచున్నది. కాని వారిచ్చిన చిత్రబంధమున అక్షరములు తారుమారైనవి. నేనిచ్చిన (చిత్రము-II) ననుసరించి దానిని సరిచేసికోవలసియున్నది.

శ్రీ శంబునాథ్‌పాండ్యేగారు తమ 'రస అలఙ్కార - పింగళ' అను గ్రంథమున మరొక రకమైన చామర బంధము నిచ్చియున్నారు. అందలి-

"తన్ మన్ ధన్ హారి హేతు కార్ జగత్ బనే మహాన్
జ్ఞాన్ ధ్యాన్ సన్ కీన్ జీన్ ఛీన్ ధీన్ గున్ గాన్॥ - (పు -56) -
అను శ్లోకమును 'చిత్రము-III'లో చూడవచ్చును

ప్రాచీన లాక్షణికులు కాని, కవులు కాని పేర్కొనని ఈ చామర బంధము ఆధునికముగా తోచుచున్నది.

3. పంజర బంధము -

పంజర చిత్రమును గీసి అందు పద్యమును కూర్చుట పంజర బంధము. నాదెళ్ల పురుషోత్తమ కవిగారు తమ 'అద్భుతోత్తర రామాయణము'న దీనికి లక్ష్యమునిచ్చియున్నారు. దాని చిత్ర నిర్మాణవిధానము వారిదేయగు 'చిత్రకందపద్య రత్నాకరము'న నున్నది. (పు-26) -

"నిపుణత రాజిలు సీతా
కృపతావరమయ్యె దీరు కృత షోడశ చం
ద్రపదేద్యాకృతి వగు మీ
ద్రుపదాత్తము నామనికుడు తుట్టే తక్కున్" (7-152) -

అను ఆ కందమును పంజర చిత్రమున కూర్పగా, అందలి 2, 5 చాలు లలో నాయికా నాయకులగు 'సీతాదేవత' 'రామచంద్రుడు' అను పదబంధములును, 8వ చాలులో 'పురుషోత్తమ' అను కవిపేరును, పొందుపరుపబడినట్లు స్పష్టమగును (చిత్రము-IV).

4. భారతీయ పతాక బంధము -

భారతీయ పతాక చిత్రమున పద్యము కూర్పబడుట భారతీయ పతాక బంధము. ఇది కూడ యత్కృతమో తెలియదు. కాని అందు -

"భారత లక్ష్మి కరవర
ధారధురన్ధర సురత్నరమ్యారక్షా
కారణ నంబుల నరహరి
మారాకారాంగకా సుమవిమలతరాభా"-

అను కందముగలదు. దాని చిత్రవిన్యాసమును'చిత్రముV-'లో

చూడవచ్చును. 'తాలాంకనందినీ పరిణయము'న 'పతాకబంధము' (పు.321) ఒకటి కలదు కాని దాని విన్యాసము క్రమబద్ధముగా లేదు.

5 మత్స్యబంధము -

మత్స్య చిత్రమును గీసి, అందు పద్యమును కూర్చుట మత్యబంధము.

'శ్రీ వేల్పుగొండ లక్ష్మీ నృసింహ మహాత్మ్యము'న శ్రీ లక్ష్మీ నృసింహాచార్యులవారు ఈ బంధమునకు లక్ష్యమును వ్రాసినారు. అది -

"పాత్ర రూప సుఖ లేఖదా
మిత్ర నేత్ర ఖగ పత్రగా
గాత్ర చిద్ఘన శుభాంశుకా
చిత్ర గాత్ర ధర సత్రపా"- (2-133) -

అను భద్రికావృత్తమున నున్నది (చిత్రము-VI).

6. వీణాబంధము -

వీణ చిత్రమున మెట్లలో పద్యమును కూర్చుట వీణాబంధము.

శ్రీ బండ్ల సుబ్రహ్మణ్య శర్మగారు తమ 'ఆంధ్రమహాభ్యుదయము'న సరస్వతీ ప్రార్థనమును వీణాబంధమున వేసి, ఔచిత్యమును చూపినారు. అది -

"పావన భాసమాన గుణిపాలన సజ్జన లక్ష్యలక్షణ
శ్రీ విధి వేదమోద పదచిహ్న సుధారస రమ్యరాజ్య పా
పావృతజిత్ స్వభావ విజయా ఘన ధీజనవంద్య సత్కళా
దేవకృతీ యమోఘకృతి ధీనిధి నీతిమతీ లసత్కృపా" -

అను ఉత్పలమాలయందున్నది. ఆ చిత్రబంధపు 16వ చాలులో 'సరస్వతీ' అనియు, 6వ చాలులో 'నమోనమో' అనియు పదబంధములు కలవు (చిత్రము-VII).

7. సుమలతా మంటపము -

సుమలతా మంటపము వలె చతురస్రాకారముగా సమాక్షర విన్యాసముతో కూర్పబడిన ఈ చిత్రబంధమున -

"సౌజన్యజయద నైజాందేశమున ముఖ్య
ముగను మోర్తాట్పురమున ముదమున
నలరు సత్కుల మిల నల శిరశినహాళ
నగ నవ నవ శుభోన్నతులు గలుగ
వగతోడ నట నగ్రవర్ణ వరవసతి
గలిగిన కవికనక బిరుదయుత
పదమెద.వదలని వరవిష్ణు మతమహి
మగను శ్రీకృష్ణ నామ విమలమతి
చంద్రషడ్ద్వీప సమసంఖ్య సనిన శకము
నను జనులు నుతియింపగా నంబులమల
గలయ నరహరి వివిధ విఖ్య విధ బంధ
శతము దమ దయదరిగొల్వ సల్పె నోజ" -

అను సీస పద్యమున్నది. దానిని బట్టి ఈ బంధమును 'కవికనక' బిరుదాంచితుడగు 'శ్రీకృష్ణకవి' యను నాతడు క్రీ.శ.1961లో రచించి నట్లు తెలియుచున్నది. దాని చిత్రవిన్యాసమును 'చిత్రము-VIII'లో చూడవచ్చును.

ఇలాగే సమాక్షర విన్యాసముతో నున్న చిత్రబంధములు మరికొన్ని కలవు. కాని అవన్నియు ఆధునికములే. ప్రాచీనులు చెప్పినవి కావు.

మరికొన్ని బంధములు -వినుటకు సొంపుగా నున్నను, క్రమాక్షర విన్యాసము లేక, అక్షరములు చిత్రమునందు ఎట్లో ఒకట్లు నింపుటయే ధ్యేముగా నున్నవియు కలవు. ఉదాహరణకు -

1. ఓంకార బంధము - (చిత్రము -IX) -
"సిరి మురిపము జూపగ
సురవరులందరు కరము పొగడ వరదుడవై శ్రీ
నరహరి నంబులగిరిపా
తిరమొందితి భక్తసజ్ఞ తిమిరవిభజ్ఞా" - (వ్రాతప్రతి)

2. శ్రీకారబంధము - (చిత్రము-X) -
"శ్రీవర పరమదయాకర

భావజ సద్దేహాభాస వసుధాధీశా
పావన సంబుల గిరిగత
దేవా నరసింహా యేలితివ కలిమధనా" - (వ్రాతప్రతి).

ఇట్టివి 'చిత్ర కావ్య కౌతుకము', 'ప్రబంధ సంబంధ బంధ నిబంధన గ్రంధము'నను అనేకము కలవు. ఉదాహరణకు - "కంకతికాబంధము (దువ్వెన) -గళంతికా (కూజా) బంధము- ఝూరీ బంధము - తాడఘ (సుత్తె, సమ్మెట) బంధము - శలభబంధము- కమఠబంధము- పీటికా బంధము - నాసికా ముకుర బంధము - కిరీట బంధము - కుంచికా బంధము - ధూప బంధము - మంత్ర పుష్ప బంధము - ప్రదక్షిణ నమస్కార బంధము - కమండల బంధము - థాల బంధము - ధనుర్బంధము - యాత్రికబంధము - గణికా బంధము - మొదలైన "కాదేదీ కవిత కనర్హం" అన్న పద్ధతిలో సాగినవి.

అట్టి నూతన బంధములు వెఱ్ఱితలలు వేసిన ఉపజ్ఞకు నిదర్శనములై ప్రజ్ఞాపాటవములకు నికషోపలమ్మైన చిత్రకవితాస్థాయిని దిగజార్చుటయేకాక, దాని పట్ల అసహ్యాము కలుగునట్లు చేసిన వనుటలో సందేహాము లేదు. అందువలన ఇంకను క్రొత్తబంధములను నిర్మింపబూనుట దుస్సాహసమనవచ్చును. చిత్రకవితపైన వెగటు పుట్టకుండుటకు అట్టివానిని పరిహరించుటయుక్తము -అవసరము కూడ!



శ్లోక స్తూపబంధము

[చిత్రము - I].



చామరబంధము - 2
[చిత్రము-III].



పంజర బంధము

[చిత్రము - IV].




భారతీయపతాకబంధము
[చిత్రము-V].

# ఉపసంహారము

ఇంత విస్తృతమైన పరిధి కలిగి, రకరకముల ప్రక్రియలతో పరిఢవిల్లిన ఈ చిత్రకవితలో కావ్యమునకు ప్రధానములైన రసధ్వనులు లుప్తమనియే చెప్పవచ్చును.

చక్ర-పద్మబంధములలో కవినామ గుణక్రియాదులు ధ్వని పూర్వకముగా చెప్పుట తప్ప, మిగిలిన వానిలో అదియును శూన్యమే. పై వానిలో నైనను అది నామమాత్రమేకాని, అంతకన్న అధికము కాదు.

ఇక రసమన్నది కంచుకాగడా పెట్టి వెదికినను ఇందు కనిపింపదు. అక్షరాన్వేషణమే అక్షరాన్వేషణ మగుటవలన, రసనిష్ఠకు సమయమే దొరకదు. ఆ అక్షరముల కూర్పుకై పడెడి బాధ భావమును బాధించుటయే కాక, వృత్తములకు గూడ బాధాకరమైనది. చక్కగా నడువవలసిన వృత్తములు కూడ చికాకు కల్గించునవైనవి. కమ్మని పద్యములకు కొరత ఏర్పడి, చివరకు అవి ఏవో కూడ గుర్తింపరాని అయోమయస్థితి ఏర్పడినది.

ఈ లోపములన్నియు కలిసి కవుల ప్రతిభను కుంటుపరచినవి. అర్థముకాని పదగుంభనము పరితలకు విసుగు పుట్టించినది.

వీటన్నిటికి తోడు చిత్రకవితలో చోటుచేసికొన్న సృష్టిలోని సమస్త వస్తుజాలము దానిపట్ల విహ్వాభావమును కలిగించినది.

ఇట్లు సుకవితకు ఉండవలసిన లక్షణములన్నియు లోపించిన ఈ చిత్రకవిత రసజ్ఞులకు ఆహ్లాదమునుకాని, ఆనందమునుకాని కలిగించకపోవుటలో ఆశ్చర్యము లేదు. అందువలననే ఈ చిత్రకవితను మనవారు ఉత్తమశ్రేణి కవితగా పరిగణింపకపోవుట సమంజసమే!

'చిత్రము' అన్న శబ్దమునకు 'ఆశ్చర్య'మను అర్థము కూడ ఉన్నది కనుక, 'చిత్రకవితయనగా ఆశ్చర్యమును కలిగించుకవిత' అను నామమాత్ర ఫలమే దాని ప్రయోజనమని చెప్పి సమర్థించుకొనుట యుక్తము.

ఇతి శమ్.